# శ్రీ గీతగోవింద రహస్యము

ముద్రాపయిత :

శ్రీ రెడ్డిబత్తుల రామిరెడ్డి

'అభినవజయదేవ'

చల్లా పిచ్చయ్యశాస్త్రి

(శతావధాని)

శ్రీః

# కృతి సమర్పణము

సీ॥ సప్తసంతతులం బ్రశస్తిం గాంచెను కడల్
పుట్టినప్పుడ కళా, పూర్ణయగును
సోదరు లెండఱో, చుట్టియుందురు సదా
మృదుమధురోక్తుల మెలపు నెఱపు
భావసౌధమున శుంభద్గతుల్ పచరించు
శక్తి వ్యుత్పత్తియన్ సఖులు విడరు
దీర్ఘాయురెప్పుడు దీవనల్ జెందు, మ
హానంద మాహారమనుభవించు

గీ॥ కృతియనెడు సంతతి యటంచు నెసంగి దలంచి
యీ కృతి నలంకృత సువర్ణ నెదగ్రహించి
కృష్ణపరమాత్మ కిడంగ ముద్రించెం గాన
నేమమే పాడిగిడ్డిగా రామిరెడ్డి.

గీ॥ రెడ్డిశబ్దమ్ము తలపంగ శ్రేష్ఠవాచి
భక్తిశబ్దమ్ము వికృతి యా బత్తియనంగ
హరిహరులయందు సద్భక్తియులరు కతన
రెడ్డి బత్తులయింటి పేర్పృథ్వి వెలసె॥.

గీ॥ ఇందు, గోవిందకృతి వెలయించినట్టి
రామిరెడ్డి జనించె నిర్మలగుణుండు
తండ్రి తాతాభిధానుండు తత్త్వవేత్త
యన్న చెంచాహ్వయుండు నునంతవాఁడె.

గీ॥ దేశభక్తియు గురుభక్తి దేవభక్తి
తేజరిల్ల మహోత్సాహ దీక్షలెసఁగి
తొల్లి వంశ్యులు కూర్చిన చల్లనైన
కీర్తి శ్రీరామిరెడ్డి సుకృతి వెలార్చె.

గీ॥ సారసారస్వత సుధారసంబు గ్రోలు
కృతికి శ్రీరామిరెడ్డి సుమతికి సతమ్ము
రాధికాకృష్ణమూర్తి నీరంధ్రకీర్తి
కోరిన వరంబులను సమకూర్చుఁగాత.



కృతి కర్త:
శ్రీ చల్లా పిచ్చయ్యశాస్త్రి

ర్గర్భిత మొనర్చి పైకిమాత్రము నవసరములకు శృంగార మగు శృంగారరసము ప్రధానముగా ప్రాకృత నాయికా నాయకులకుబలె నడపెను. కుంచెచే లేఖినిచే రంగులచే చిత్రించు కేవల శిల్పమునకు కారణమయి (ఒరిజనల్) ఎండక తడియక మాయక చెక్కుచెదరక మనోమయకోశము లుండువఱకు ప్రకాశించు వాఙ్మయ శిల్పమునందు, ఇరువది నాల్గు సంఖ్య విలసిల్లఁజాలిన యష్టపదీ గేయములందు, ఇరువదినాల్గు రాధాకృష్ణ ప్రతిబింబములను భావప్రపంచము నందు తిరుగఁజాలిన రసజ్ఞుల జ్ఞానమయ నేత్రమునకు గోచ రించునట్లు కడుంగడు రమ్యముగాఁ జిత్రించినాఁడు. ఉత్తర హిందూస్థానమున వోక్స్ పండితులచే సంస్కృతభాషలో వ్రాయఁబడిన బహుభాష్యములనుచూచి వాని యన్నిటి సారముగా గీతగోవింద రహస్యమనుపేర కృతికి నిర్ణయించి క్రమముగా శ్లోకములను గేయములను మూలముల్వ్రాసి వెంటనే రహస్యమును వచనరూపమునఁబ్రకటించితిని. భక్తి శృంగారరస సముద్రమునందు అంతర్లీనమైయున్న రాధా కృష్ణ ప్రతిబింబములు దేనియం దేవిధముగా కవి చిత్రించెనో వాని నన్నింటిని (24) ను వివరించి శిల్పిచదివి చిత్రించుటకు వీలుగా వ్రాసితిని.

"దశావతార కీర్తిధవళము" హరివిజయ మంగళా చారమని యిరువదినాల్గు గేయములకు పై భాగమున నిరువదినాల్గు సాంకేతిక నామములు మూలమునందు కవి ప్రకటించినాఁడు. వానిలోని రహస్యముకూడ వివరించితిని.

మఱియు నింద ముఖాధర నేత్రాదులయిన యవయవములు శృంగార రసానయవములుగా పైకి కన్పించునవి. రాధా కృష్ణులు ప్రకృతి పురుషులను శుద్ధాద్వైత తత్త్వరహస్య మును తెలియజేయు సాధనలుగా ఆధ్యాత్మికానుభవ గ్రంథ పరిశోధన వివరణ సహాయముచే ప్రక్కనే ప్రకటించితిని. ఈ గీతగోవింద రహస్యమును అంతర్ముఖులయిన రసజ్ఞులు పరిశీలించి నన్నాశీర్వదింతురు గాక.

దీనిలోని సారాంశమును చెప్పి వినిపించి నంతనే మహోత్సాహముతో దీక్షబూని యీ గీతగోవింద రహస్య మును ముద్రింపించిన శ్రీ రెడ్డిబత్తుల రామిరెడ్డి సుధీరత్న మును దీర్ఘాయురారోగ్య పుత్రపౌత్ర ధన కనక వస్తువాహన సంపన్నునిగా శ్రీ రాధా కృష్ణు లనుగ్రహింతురు గాక.

ఇట్లు
గ్రంథకర్త

| ముక్తికాంతావయవములు | | కాంతావయవములు |
|---|---|---|
| నిర్వేదము | ఎట్లు తరింతునను విచారము | అధరము |
| సద్విచారము | | అధరామృతము |
| మనోలయము | | ముఖము |
| సత్తు - చిత్తు<br>ఉండుట - జ్ఞానము | | స్తనద్వయము |
| విక్షేపము | | పయ్యెదచివర |
| సత్త్వము | | నీవి |
| ఐక్యము | జీవేశ్వరు లొకటిగా నెఱుంగుట | ఆలింగనము |
| విషయానుభవము<br>విజాతీయజ్ఞప్తి | | లజ్జ |
| సమరస ధ్యానము<br>సజాతీయజ్ఞప్తి | | ప్రణయము |
| వైరాగ్యము బోధము | | హస్తములు |
| భక్తిశ్రద్ధలు | | పాదములు |
| ప్రణవము | | శిరస్సు |
| వేదాంత శ్రవణము | | చెవులు |
| జ్ఞానము | | నేత్రములు |
| మననము | | కంఠము |
| శుద్ధసత్త్వము | | ఆకారము |

# శ్రీ గీతగోవింద రహస్యము

## రహస్యావతరణము

శ్రీ జగన్నాథావతారమగు జయదేవకవి ప్రకృతి పురుషరూప రాధామాధవ పరస్పరావినాభావ ప్రణయ రసము, మృదుమధురపదరసాస్పద సంగీత సాహిత్య సంమేళన మొనరించి గీతగోవిందకావ్య ముఖమున సరసజన శ్రవణ కుహరంబుల నింపినాడు. అందు గేయము లష్ట పదులుగా నియమించినాడు. అష్టపదులు సువర్ణ పూరితము లగుటను, సువర్ణము అష్టాపదశబ్దవాచ్యమగుటను, లోహము లలో బంగారమువలె, గేయములలో, నివి శ్రేష్ఠములని యొక విధముగాను, అష్టాచక్రము నవద్వారము, దేవపుర మని, యుపనిషత్సిద్ధాంతము. శరీరమునకు సంబంధించినవని యొక విధముగాను, స్ఫురించుటం జేసి యట్లు నడపినాడు.

మొదటి యష్టపదిలో బదునొకండు పాదములు కన్పించుచున్నవి. నియమభంగము కాలేదా? యని యొక పూర్వపక్షము పాఠకులకుతోచును. కాని పాఠకపత

నోచితముగా, కవి, గేయములందు ప్రతిపాదించిన, నియమముకన్న, సృష్టి, స్థితిలయకర్తయగు భగవానుని దుష్టశిక్షణ, శిష్టరక్షణాత్మక దశావతార వర్ణనక్రమ నియమము, బలవత్తరమని పరిహారము చెప్పుకొనఁదగును. తక్కిన గేయము లన్నిటియందును కవికృతాష్టపద నియమము బాగుగ బరిపాలింపబడినది.

జయదేవ మహాకవి ప్రశంస

శ్లో॥ వాచః పల్లవయ త్యుమాపతిధర స్సందర్భశుద్ధిం గిరామ్
జానీతే జయదేవఏవ శరణః శ్లాఘ్యో దురూహద్రుతే,
శృంగారోత్తరసత్ప్రబంధరచనై రాచార్యగోవర్ధన
స్పర్ధీ కోఽపి నవిశ్రుత శ్శ్రుతిధరో ధోయీ కవిక్ష్మాపతిః॥

జయదేవకవి లక్షణసేన మహారాజాస్థాన కవులలో ప్రధానుఁడు కావుటవలన, తత్సమకాలీనులును, తదాస్థానస్థులును నగు ఉమాపతిధరుని శరణుని, ఆచార్యగోవర్ధనుని ధోయిని, సమరసత్వ మెఱుకపడ గీతగోవింద కావ్యమున పేర్కొనెను.

మంగళాచరణము

శ్లో॥ మేఘైర్మేదురమంబరం, వనభువశ్శ్యామా స్తమాలద్రుమైః
నక్తం భీరు రయం త్వమేవతదిమం, రాధే! గృహంప్రాపయ!'
ఇత్థం నందనిదేశత శ్చలితయోః ప్రత్యధ్వకుంజద్రుమమ్
రాధామాధవయో ర్జయన్తి యమునాకూలే రహఃకేళయః॥

కావ్యాదిని నాయికా నాయకులగు రాధామాధవులు యమునానదీ పరిసరమందు చిమ్మచీకటిలో మబ్బులు క్రమ్మినవనములలో, కానుంగుచెట్ల జొంపములలో రహస్య క్రీడల విహారింపబోవునప్పుడు, నందుడురాధతో నితడు భయస్వభావముకలవాడు. ఇది రాత్రి సమయము. కావున రాధా! నీవే యింటికి జేర్పవలయునను నొక మంగళాచారము భావగర్భితముగా నెలకొల్పినాడు.

యమునానది, మబ్బులు, కానుంగుచెట్లు రాత్రియు నల్లనివి. కృష్ణుడు నల్లనివాడు. కాబట్టి రాకపోకలయందు త్రోవదప్పి పోకుండ రాధ ధరించిన రత్నభూషణకాంతులు గాలికి జలింపక చమురు వత్తిలేని దీపములుగా, కాలియంది యలయు, త్రేళ్ళమట్టియలయు చప్పుళ్లు, వనచారులయిన సత్త్వముల దారి తొలగి చనజేయగా, భయము కలుగుట కవకాశము లేదు గావున నందుడు రాధనే కృష్ణు నిలుసేర్పుమని చెప్పుట బహిరంగభావము.

ఆకాశమున మబ్బులు క్రమ్మెననగా, జ్ఞానమణిని, మాయపొర లావరించుట యనియు వనభూములు కానుగు చెట్లచే, నల్లనైనవి యనగా, నింద్రియములు, శబ్ద స్పర్శ రూప రస గంధములను విషయములచే దూషితము లయ్యె ననియు, రాత్రి యనగా దనలోనేయున్న పదార్థమును తానెఱుంగకుండ (మఱపు జెందుట) యనియు, ఇతడు భీరువన, నామరూప క్రియారహితుడైన తాను, నామరూప

క్రియాసహితుడగుట జీవదశ జెంది కల్పిత సంసారము నుండి యెట్లు స్వస్థానము జేరుదునోయని, నిర్వేదపడుట యనియు. అందువలన నీవేయితనిని, నింటికి జేర్పుమనగా, సచ్చిదానంద స్వరూపుడైన, తాను జీవదశకులోబడి, శోక మోహాదులచే బద్ధుడై, జననమరణ ప్రవాహమున గొట్టుకొని పోవుటను, ఆత్మశక్తిచేతనే, తిరిగి స్వాత్మావబోధము పొందుట యనియు, ఇట్లునందుని యాదేశమువలన ననగా నిర్వేద సమనంతరము సద్గురు నాశ్రయించినగాని పై ప్రబోధము కలుగదనియు "బయలుదేరిన రాధామాధవులన, సర్వాంతర్యాములయిన ప్రకృతిపురుషు లనియు" యమునా తీరమందు వారి రహః కేళులు త్కార్ష జెందుచున్నవన, స్థూల సూక్ష్మకారణములను సంజ్ఞలుగల శరీర త్రయమందు, మూడవది యగు కారణశరీరములో గాఢ సుషుప్తియను సమాధి యందు, హాయియుయ్యేలకు చేరులై, యజపాగాయత్రీ సంజ్ఞితము, హంస మంత్రాత్మకమునై యూగు 'సోహం' ధ్వన్యాత్మకమగు నిట్టూర్పులు, గురూప దిష్ట మార్గమున గుర్తెఱుంగుట యనియు గీత గోవింద కావ్యాష్టపదీ రహస్యము.

శ్లో॥ వాగ్దేవతాచరిత చిత్రితచిత్తసద్మా
పద్మావతీచరణచారణచక్రవర్తీ
శ్రీవాసుదేవరతి కేళికథాసమేత
మేతం కరోతి జయదేవకవిః ప్రబంధమ్॥

సరస్వతీదేవి జయదేవుని హృదయమను నింటిలో దిరుగుచుండుటన తగిన యావరణము కలిగి గట్టిగా గట్టిన యింటిలో జేరినవారికి శీత వాతాతపాది బాధలు లేనట్లు ఛందో వ్యాకరణా నౌచిత్యాది దోషరహితమైన కావ్య వాఙ్మయము సలక్షణ సంప్రదాయమైన శాస్త్రవాఙ్మయము స్వరబద్ధమయిన వైదిక వాఙ్మయము సర్వహృదయ రంజకములయిన సంగీత సాహిత్యములును, తమకు తగిన యాశ్రయస్థానమని జయదేవుని హృదయమునకు స్వాయముగా జేరుటయని తెలియనగును.

పద్మావతిని నటింపఁజేసిన నటకచక్రవర్తియన ఒకప్పుడు పద్మావతీ జయదేవులను ప్రబోధముగోఅకై వింధ్య దేశాధీశ్వరుఁడు తన సంస్థానమును జేర్చెను. ఇట్లుండ కొంత కాలమునకు ప్రభువు బావమఅది మరణించెననియు, తద్భార్య సహగమనము చేసెననియు నొకవార్త యంతఃపురమునకు వచ్చెను. రోదనధ్వని వినినవెంటనే పౌరస్త్రీలు పట్టపుదేవిని నోదార్ప మూగిరి. ప్రబోధించుచున్న పద్మావతి యేమియు బల్కరింపక మిన్నకుండెను. రాజ్ఞి యదిచూచి యందఱు ననోదార్ప నీవేల మిన్నకుంటివన నామె నవ్వి "జీవులు కాలవశులై మరణించుట సహజము. సహగమన మనఁగా ప్రాణ మగ్నిపాలు సేయుట కాదు. భర్తృమృతి విన్నంతనే స్త్రీతన పాతివ్రత్య మహిమచే తన ప్రాణములు తానే వదలుట" యని తెలుసుకొనుఁ డనెను. దానిని బరీక్షించుటకై జయ

దేవునితోఁగూడ రాజు వేట కేగినప్పుడు జయదేవు నాకస్మికముగా నొక పులి భ్రమింగెనని రాజ్ఞి లేనివార్త పుట్టించెను. వెంటనే పద్మావతి ప్రాణములు వదలెను. పట్టపుదేవి మిక్కిలి తత్తరపడెను. రాజునకు తెలిసి జయదేవుని కాళ్ల పై వ్రాలెను. దేవకవి రాజదంపతుల కభయమిచ్చి " ప్రియే! చారుశీలే! " యను పందొమ్మిదవ యష్టపదిని పాడెను. వెంటనే పద్మావతీదేవి లేచి నృత్య మొనరించెను. అష్టపదీ రచనకు నిదియే మొదటిదని తెలియనగును.

శ్రీరాధాకృష్ణుని సర్వదా ననవిద భక్తులతో ధ్యానముజేయుట గ్రంధమందంతట బ్రకటింప బడినది. భగవానుని విలాసములు మహోల్లాసము కలుగునట్లు ప్రతి పద్యమందును ప్రతిగేయమందును ప్రదర్శింపబడినవి. ఇరువది నాల్గష్టపదులయందును, ఇరువదినాల్గు శ్రీ రాధాకృష్ణ దివ్యమూర్తుల, భవ్యవాఙ్మయ శిల్పమున నంతర్ముఖ్ములకు కనులపండువుగాఁ జెవులపండువుగా నిర్మింపబడినవి.

సంగీతములో దేవకవి గొప్పదనము) 'వ్యాఘమిశ్రుడను సంగీతవేత్త పఠమంజూరిగాగము పాడవృక్షముల యాకులన్నియు శిశిరర్తువున మాదిరిగా గలగల రాలిపోయెను వెంటనేపోటీ యట్లు జయదేవుడు వసంతరాగము పాడెను. తక్షణమే చెట్లన్నియు జిగిర్చెను. పద్మావతీ ముఖమున నాట్యకలా సంపూర్ణ నిర్వహణ మొనరించెను.

శ్లో॥ యది హరిస్మరణే సరసం మనో
యది విలాసకలాసు కుతూహలమ్
మధురకోమలకాన్తపదావళీం
శ్రుణు తదా జయదేవసరస్వతీమ్! ॥

నిరర్గళత్వము నిర్దుష్టత్వము శ్రవణపాత మాత్ర హృదయరంజనము సరళవర్ణప్రయోగము ఓజస్సు, ద్రాక్షా పాకము అక్లిష్టాన్వయము సముచితాలంకార సామగ్రి చమత్కృతిరసపుష్టి నవనవప్రతిభా విశేషము, అపూర్వము మున్నగు పరికరములతోఁగూడిన కవిత యక్షర రమ్యత్వముతో ప్రకటింపబడినదని యిందు జయదేవుని సర్వతోముఖమయిన మహాశక్తి తప్పక స్ఫురించును.

# దశావతార కీర్తి ధవళము

సామోద దామోదరము

జయదేవుడు తన యష్టపదుల కొక్కొక్క దాని కొక్కొక్క సాంకేతిక నామము కల్పించెను. ప్రథమాష్ట పదికి ముందు (సామోద దామోదర) అని నిర్మించెను. దాని కర్థము సామోదర సంతోషముతో కూడిన దామోదరము = కృష్ణుడు కలది, సామోద = పరిమళముతో గూడిన దామోదరము = వనమాల మొదలయిన పూదండలుకల భగవంతుడు కలది. వ్యంగ్యముగా పది యవతారములను పూల దండలుగాఁ జెప్పవచ్చును.

అష్టపది (1) [ ప్రళయపయోధి ]

# మత్స్యావతారము

జలముల యందున్న పరమాణు రూపములను పరిశీలించుటకు జలచరములకే సులువుగావున కేవల ధ్వనిమయములయిన వేదములను, జిహ్వేంద్రియమునకు కారణములయిన జలముల యందు పరాదశలో నిమగ్నములయిన వాని నుద్ధరించుటకు శ్రీహరి మత్స్యరూపము ధరించెను. మఱియు జలచర శిశువులకు కడుపునిండుట తక్కిన శిశువులకు వలెఁగాదు. జలచర శిశువులు తల్లి వెంట గుంపుగాఁ

బోవుచుండును. మధ్య మధ్య తల్లి వెనుకకు దిరిగి పిల్లల నొకటిగా జూచెను. వెంటనే వానికి కడుపునిండును. అట్లే సద్గురువు కటాక్షించిన సర్వసందేహ విచ్ఛేదమై నిరతిశయానందము శిష్యునకు కలుగును. ఈ రహస్యము గూడ నీ యవతారము వలనఁ దెలియనగును.

# కూర్మావతారము

గ్రంథాంతరముల యందమృతము కొఱకు దేవ దానవులు పాలసముద్రమును పాలకుండను మందర పర్వతమును కవ్వముగాఁజేసి చిలుకుచుండ నడుగునఁ దగుమట్టు లేమిఁ దిరుగకున్న విచారపడి దేవతలు శ్రీహరిని బ్రార్థింపఁ దాను కఠినాతి కఠినమయిన పై భాగముతోఁ దాఁబేటి రూపును ధరించెనని చెప్పుచున్నవి. జయదేవ కవితాను నట్లే చెప్పుచు మిక్కిలి విశాలమయిన పృష్ఠ భాగముగల శ్రీహరి తాఁబేటి రూపమున సర్వ సర్వం సహాధారం ధర్యము విశేషముగాఁ జెప్పెను. మత్స్యావతారమందు బలెనీయవతారమందు గూడ నొక విశేషముకలదు. (తాబేలు యొకచోట గ్రుడ్లు పెట్టికొంతకాలమునకు త్సంతానమును వదలి మఱియొక స్థానమునకు చేరును. ఎప్పుడో తానువిడిచి వచ్చిన పిల్లలేమయ్యెనో యని స్మరించుకొనును. వెంటనే శిశువులకు కడుపు నిండును ప్రబోధ మొనరించి మఱియొక స్థానముఁ

జేరియుండి చిరకాలమునకు తొల్లింటి శిష్యులెట్లుండిరో యని స్మరించుకొనును. వెంటనే వారికి మఱపుచెందిన విషయము లన్నియు స్మృతికి వచ్చును.

## వరహావతారము

చంద్రుని యందలి కళంకరేఖవలె భూమిని పోల్చుట చే శ్వేతవరాహరూపము ప్రకటింపఁబడినది విష్ణుమూర్తికిఁగల సత్వగుణముగూడ ధ్వనింపజేయబడినది. భూమినుద్ధరించుట యనగా యజ్ఞములు వేదాధ్యయనత పోజ్ఞానాదిరూపములు ప్రజలు ధర్మార్థకామములను పురుషార్థములను ప్రధాన మయిన ధర్మముతోనే మాత్రము సంబంధములేక కేవల మర్థకామముల నాశ్రయించి దుర్విషయలంపటులుగఁ జెలరే గిన యధర్మమే హిరణ్యారాక్షస రూపమున భూమినిజలముల ముంచివేయగాఁ అవాంతర ప్రళయము కల్పింపఁగా) గీతా వాక్యప్రకారము ప్రజలకు యజ్ఞములకుఁగల పరస్పర సంబం ధమును తెలియఁజేయ (నుద్ధరింప) యజ్ఞాంగములన్నియు వరహావయవములుగా, యజ్ఞవరాహ మూర్తియని యభి వర్ణింపబడెను. మఱియు శుద్ధస్ఫటిక సంకాశమైన పరిశుద్ధా ద్వైత పరతత్వ స్వరూపము రహస్యము.

# నరసింహావతారము

విష్ణుమూర్తి యీయవతారమందు సగము నరాకారము సగము సింహాకారముగా లోకమున కత్యద్భుతము కలిగించె నని భాగవతాదులయందు జెప్పఁబడినది. జయదేవ మహాకవి భగవానునిచేతి గోటి వాడవునకు కఠినత్వమునకు మహా ద్భుతము ప్రకటించినాడు. ఇందు సామాన్య జీవలోకము నందు విళంబము చేసినచో గోటితోఁ దుంపఁదగినది గొడ్డలిచే ఛేదింపవలెనను లోకోక్తి భగవంతునియెడ గొడ్డళ్ళకు గూడ ఛేదింప నలవికానిది కొనగోటికే సాధ్యమగుట తెలియ చేయబడినది. హస్తమునకు కమలమును బోల్చుట నరరూప సహజమయిన మృదుత్వము. సౌందర్యము గోటికి వాడవున మహాద్భుతమును జెప్పుట సింహరూప సహజమయిన కఠినత్వమును ధ్వనింపఁజేసెను. హిరణ్యకశిపుని భృంగముగాఁ బోల్చుటచే భగవన్నామ కుసుమ మకరంద పానమునకు విముఖుడై దుర్విషయభోగ దుత్తూర పుష్పములయందు సర్వదా వ్రాలియుండు మాలిన్యమూర్తి యయిన తమోగుణము ధ్వనింపఁ జేయబడినది. పదునాల్గు భువనముల యోధులకును నలవిగాని మహాబలశాలియైన రక్కసుని తుమ్మెదను చీల్చినట్లు చెప్పుటచే, తమోగుణ మూర్తు లెంతటివైనను, చండభాస్కర కిరణములకు చిమ్మచీకట్లవలె సుళువుగా నశింపజేయుట భగవంతునకు సహజశక్తియని ప్రకటింపబడినది, ప్రణవనాద మను' సింహ గర్జనమునకు నఘాంకార, ఘీంకారము లణగిపోవుట రహస్యము.

# పరశురామావతారము

ఇందు రాజ శరీరముల ధరించి భరింప శక్యముగాని యధర్మ మార్గముల స్వేచ్ఛగా జెలరేగు దైత్యులను నిశ్శేషముగా వధించుట రక్తమయ మయిన యుదకముల యందు జగత్తును స్నానము జేయించెననుటఁ దెలియజేయఁ బడినది. పాపమును తొలగించి సంసారతాపమును శమింపఁ జేసెననుట, పరమ పవిత్రమయిన తపశ్శక్తి తెలియ జేయ బడినది.

చతురుపాయ సాధ్యముకాని దానిని శరముచే శిక్షించు రాజత్వమునకు నుచ్చారణ మాత్రమున, రూప మునకు ప్రాణముతోనే రూపాంతరమును కల్పించు శాప ముచే శిక్షించు బ్రహ్మత్వమునకు పరస్పరమ వినాభావ మవసరమనియు, ధ్వనింప జేయబడినది. ఉపాధులకే ప్రళ యము. ఆత్మ సత్త్వము నిత్యమగుట రహస్యము.

# శ్రీరామావతారము

ఇది పరశురామావతారమునకు కారకులై యమార్గ ప్రవర్తకులయిన హైహయులోర్చిన దాజవంశ కళంకమును, నిశ్శేషముగాఁ బోగొట్టుటకై రాజు నరరూపుడయిన భగ వంతుఁడనుమాట నిలబెట్టుటకై, సూర్యునివలె రాష్ట్రప్రజల యజ్ఞానరూపమగు చిమ్మచీకటిని తఱిమి ధర్మము నాల్గు

పాదముల నడపించుటకై వచ్చినది. జయదేవ కవి దిక్పాల కుల కింపయిన రావణవధ ప్రధానముగా వర్ణించెను. దీనిచే బ్రహ్మవంశమందుఁ బుట్టినను నాల్గువేదములు షట్ఛాస్త్రము లధ్యయనము చేసినను. సంగీత ప్రవీణుడైనను, భయంకరమగు తపోనియమములచేఁ బరమేశ్వరుని సాక్షాత్కరింపఁ జేసికొనినను, మహాబల సంపన్నుండైనను నిత్యాగ్ని హోత్రములు గృహమం దాచరించు చున్నను, విధిని వదలి పరదారాపహరణ రూపమయిన నిషేధమును, నిర్భయముగా, నిరంకుశముగాఁ జేసి బ్రతివీరుడైన రావణునివలె నశించునను నీతి తెలియఁ జేయఁబడినది. తాటకా, సుబాహు మారీచ ఖరదూషణ త్రిశిర, శూర్పణఖాదులు, రక్కసులు నిర్నిమిత్తముగాఁ గన్పించుజీవులహింసించుట, యజ్ఞభంగము నొనరించుట, పరపురుషుల మోహించుట వంచనముచేయుట మాయారూపముల ధరించుట మొదలైన నిషేధము లాచరించి, కళత్ర, పుత్ర, మిత్ర సైన్యములతో నశించుట చెప్పక చెప్పఁబడినది. రాష్ట్రప్రజలకు, కొడుకులు, పితృవాక్పరిపాలనము, సత్యప్రవర్తనము, ఏకపత్నీ వ్రతమును అన్నదమ్ముల న్యోన్యానురాగము, స్త్రీలు పాతివ్రత్యమును భటులు, రాజాజ్ఞను, దూతప్రభుగౌరవ పోషణము నాచరింపవల యునను నీతిని తెలియఁ జేయుచున్నది. నిరంతరము కందమూల వాతాంబు పర్ణభక్షణములచే నాకలి చిచ్చు శమింపజేయుచు నసిధారావ్రత మమ్ములగు తపో నియమములచే పరమేశ్వరుని దివ్యస్వరూపమును తమ యందును,

సమస్త జీవులయందును, తెంపులేక చూచు పరమర్షుల సహాయముచే రాజ్యమును తమ్మును, రాజులు నిరుపద్రవముగాఁ బోషించుకొనుట ధ్వనింపజేయఁబడినది. అనుకూల దంపతుల కన్యోన్య విరహము దుస్సహమగుట తెలియఁజేయ బడినది. న్యాయము జెప్పినను విననివాని సోదరునైనను విడువవలయుననుట యెఱిఁగించినది. వంచకుని వంచించియే యడంచుట ప్రబోధించినది. దేవాంశసంభూతులకు పంచభూతములు కూడ భయపడుట, వశపడుట ప్రకటించు చున్నది. రాక్షసమాయ లత్యద్భుతములు మానవమాత్రులకు దురూహ్యములగుట ప్రచురించినది భక్తి భావముకలుగుచో రాక్షసులయినను పురుషోత్తములకు సమాదరణీయులగుటను మానవోత్తములకు క్రోతులుకొండముచ్చులు, సాయపడుటను, సాధువులకు నిర్నిమిత్తముగా గర్వముచే మహాపరాధము లొనర్చి శాపగ్రస్తులయిన వారును జగత్ప్రభు దర్శనముచే స్పర్శనముచే శిక్షణముచే నిష్పాపులై వికారాకారములను వదలి దివ్యశరీరములను ధరించుటను వివరించినది. శ్రీరామ కింకరులకు వశముకానిది ప్రపంచమున నేదియులేదను మహాద్భుతము వ్యక్తపఱచినది. మఱియును తాటకవధ యాగరక్షణము, అహల్యాశాప విమోచనము, శివధనుర్భంగము. కాలిగోటిచే దుందుభిరాక్షస కాయోత్క్షేపణము ఏకబాణముచే సప్తతాళ ఛేదనము, సేతుబంధనము మొదలయినవి. శ్రీరామావతార మహిమను ప్రకటించినవి. శ్రీరాముఁడు

మహావిష్ణువు, సీతమహాలక్ష్మి, లక్ష్మణుఁడాది శేషుఁడు, భరత శత్రుఘ్నులు శంఖ చక్రములగుట స్పష్టమగుచున్నది. శ్రీరాముఁడు మాయావరణము తొలగించి సర్వాంతర్యామియై స్వయంప్రకాశకుఁడగు పరమాత్మయగుట యవతార రహస్యము.

## రామకృష్ణావతారము

దివ్య ప్రబోధము పూతనాది ప్రబల రాక్షస సంహారము విశ్వరూప సందర్శనము. రాసక్రీడాది మహాద్భుత మహిమలు కృష్ణుఁడే ప్రకటింప దశావతారవర్ణనయందు బలరామునకే రామోరామశ్చ రామశ్చయను నవతార ప్రసిద్ధి వచ్చుటకు తగు హేతువు తెలియఁదగియున్నది. భాగవత మందు యోగమాయతో శ్రీ మహావిష్ణువు నీవు దేవకీ గర్భమందున్న శేషాంశమును రోహిణీ గర్భముం జేర్పుము నేను నాయంశమున దేవకీ గర్భమందు దేవకి యందు వెన్వెంటనే జన్మించెదనని చెప్పుట వలన. విష్ణ్వంశముకన్న శేషాంశము ముందుగాఁ జేరుట వలన బలరామున కచ్యుతాగ్రజత్వము సంభవించినది. అందు వలన దశావతార క్రమమునందు బలరామనామమే నిర్ణయింపఁబడినది. కాని సుప్రసిద్ధి పై హేతువులచే శ్రీకృష్ణునకే యొప్పియున్నది.

రామ కృష్ణావతారములే దశావతారముల యందు మిక్కిలి గొప్పవి యను కీర్తి ప్రసంగము. నామస్మరణచే భగవన్మహిమచే లోక తారకము లగుటచే నేర్పడినది.

శ్రీకృష్ణావతారములోని విశేషములు :— మాయ, వశమగుట, స్మిత పూర్వాభిభాషిత్వము, పూతనా శకటాసుర తృణావర్తాది సంహారము, కాళీయమర్దన గోవర్ధనోద్ధరణాదికముచే దివ్యబాల్యము తెలియఁదగి యున్నది. కారాగార విమోచనమువలన సంసారబంధ మోచనము వెన్న దొంగిలుటవలన భక్త హృదయముల వశపఱచుకొనుట ఱోట బంధింపఁబడుట వలనఁ ద్రిగుణములచే బద్ధుఁడైనట్లు కన్పించుట బ్రహ్మాకృత వత్సాపహరణము వలన సర్వ ప్రపంచ సృష్టికర్తయగు బ్రహ్మను తానే సృష్టించుట, గో గోప గోపికా విహారమువలన సకలోపనిషద్వీధీ సంచారము, చల్దు లారగించుటవలన అన్నము అన్నము తినువాడును తానే యగుటను. మృద్భక్షణము వలన విశ్వరూప సందర్శనము, దావాగ్ని భక్షణమువలనఁ తాపత్రయోపశమనము, వేణుగానము వలన ప్రణవ స్వరూపము గోపికా వస్త్రాపహరణము వలన అభిమాన పరిత్యాగ బోధనము. మునిభార్య లన్న మారగింపఁజేయుటవలన కేవల కర్మఠులు పరతత్త్వస్వరూప మెఱుంగజాలకుండుట, ఇంద్రయాగ నిరోధమువలన యజ్ఞము యజ్ఞాంగములును తానేయగుట వరుణ లోకమునుండి నందుని దెచ్చుటవలన నారాయణుఁ డగుటను

మోహన మురళీగానము విని శిశువులను, భర్తలను వదలి గోపికలు యమునాతటమ్మునకు పరుగులిడుటవలన సమస్త జీవకోట్లకు పంచకోశ గుహాంతర్గతుండగు పరమాత్మయే స్త్రీ పురుషులకు ప్రాణనాథుఁ డగుటను, మాట్లాడుచునే అంతర్ధాన మగుటవలన గోపికల నిరంతర భగవత్సందర్శన విరహ దుస్సహత్వము పునర్దర్శనమువలన వాచామగోచర సంతృప్తియు అక్రూరునకు రథమునందు జలమునందు నొక సమయమునందే బలరామ కృష్ణులు దర్శన మిచ్చుటవలన భగవంతునకు భక్తులయందుగల వాత్సల్యము, చాణూర ముష్టికాసుర సంహారమువలన ఖలజన బలగర్వాపనోదము, కంస వధవలన లోకకంటక సంహారము, కృష్ణావతార ప్రధాన కార్యము, సాందీపమునియొద్ద విద్యాభ్యాసమువలన గురు శిష్యన్యాయ ప్రచారము భ్రమరగీతల వలన గోపికాజన ముఖమున భగవంతుని సర్వహృదయ సంచారము, ప్రణవ నాద స్వరూపము, ఏకాంత భక్తునకు సారూప్య కైవల్యసిద్ధి కుబ్జాభీష్టప్రదానము వలన నిరంతరాఖండ సుఖ ప్రదానము, సముద్రములో ద్వారకా నిర్మాణమువలన విశ్వకర్మ శిల్ప నైపుణ్య ప్రకటనము కాలయవన సంహారమువలన ముచికుంద రాజర్షిత్వ ప్రభావ ప్రకటనము, రుక్మిణీ కల్యాణము వలన తనకు తనశక్తి కవినాభావ సంబంధము, శ్యమంతక మణి యపహరణమువలన అర్థమువలని యనర్థత్వము, అపనిందా పరిహారోపాయ పద్ధతి జాంబవద్గర్వ పరిహారము, జాంబవతీ సత్యభామా పరిగ్రహణము, కాళిందీ, మిత్రవిందా

నాగ్నజితీ భద్రాలక్షణల పరిగ్రహణముచే తపో నియమా ధీనత్వము, బలగర్వితదుష్టసంహారము, లక్ష్మీ రూపాంతర గ్రహణము, నరకాసుర సంహారమువలన సత్యభామా యుద్ధ నైపుణ్య ప్రదర్శనము, పారిజాతాపహరణము వలన సత్యభామా ప్రియత్వము, పదాఱువేల రాజకన్యకల పరిగ్రహణమువలన సర్వోపనిషత్తులను విపరీతమార్గ ప్రవర్తకులనుండి తప్పించి వశపఱచుకొనుట, బాణాసురుని బాహుచ్ఛేద మాత్రమున వదలుటవలన భక్తపరాధీనత్వము, నృగ చరిత్రవలన ఒకనికిచ్చిన వస్తువును పొరపాటుచే నేనియు మఱియొకనికి నీయదగదనుట కపటపౌండ్రకశిరశ్ఛేదమువలన సుదర్శనాయుధ మహాప్రభావ ప్రదర్శనము షోడశసహస్ర గోప స్త్రీ సంగతత్వమువలన నిజయోగమాయా ప్రభావంబును, జరాసంధ వధవలన భీమునిపరాక్రమము ప్రకటనము శిశుపాలసాళ్వదంత వక్త్రాది సంహారమువలన మాయికులకు మాయయే అవశ్య కర్తవ్యమగుట కుచేలోపాఖ్యానము వలన ఆగామి ప్రారబ్ధసంచిత రూపమయిన కర్మయు భగవద్దర్శనమున నశించుట శ్యమంతక పంచకమందు గ్రహణ స్నానమువలన జ్యోతిర్మండలమునకు భూమండలమునకుఁగల యన్యోన్య సంబంధము నారదాదిమహర్షి సంఘము వసుదేవునిచే కృష్ణసమక్షమున యజ్ఞము చేయించుటవలన యజ్ఞ పురుషత్వ విజ్ఞానము మిథిలానగరస్థిత శ్రుతిదేవ జనకగృహ ప్రయాణమువలన సర్వదాముని ధ్యేయత్వము అనన్యభక్తి యుక్తాంతర్ముఖులయందు భగవంతునకుగల బాధ్యతయు

శ్రుతిగీతల వలన సర్వప్రపంచమునకుగల యన్యోన్యావినా భావము వృకాసుర చరిత్రవలన (భస్మాసుర) విష్ణుమాయ శంకరునకు ప్రాణదాన మొనర్చుట భృగుమహర్షి పాదతాడనము తాను సహించుటవలన శ్రీ మహావిష్ణువు శుద్ధసత్వగుణ ప్రభావము మృతబ్రాహ్మణ శిశువుల బ్రదికించుటవలన అర్జునుని యభిమాన పరిహరణము మొదలైనవి విశదీకరింపఁ బడినవి. జగన్నాటక సూత్రధారిత్వము అప్రతిహత సత్యాఖండజ్ఞాన మయత్వము కృష్ణావతార రహస్యము.)

# బుద్ధావతారము

యజ్ఞము ప్రాయమందున్న వాడు ఆయా సమయముల యందును నొకప్పు డహోరాత్రమును ప్రాల్మాలిక లేక శీఘ్రముగాను వ్యతిరేకము లేకుండగను, ఆచరింపఁ దగిన పనుల యందు సమర్థుండును, కలయర్థము బాగుగా తెలిసి ప్రయోగించిన శబ్దము స్వర్గలోకమున కామధేనువు వలె ఫల మొసంగుట ఋత్విజులు యాజకుడు యజించుతాను దేవతా ప్రీతికి యజ్ఞపురుష ప్రసాదమునకు ప్రయోగించు మంత్రముల యావదర్థము తెలిసికొనుట విద్వాంసుఁడును, యజ్ఞ దక్షిణకు సకలభూత సంతృప్తికి సస్యవృద్ధి కగు మేఘోత్పత్తికిని కారణమగు నఖండమన్న ప్రదాన

మొనర్చెను, ఆర్ధనతుండునగు వాడే యాచరింప వలయునను విధి వాక్యముల్లంఘించి యథేష్టముగా నియమరహితులై యెల్లరును పశువిశసన మొనర్చి మాంసభక్షణ లంపటు లగు దుస్థితి యాపరించి నప్పుడు తాను యజ్ఞపురుషుం డయ్యును నాకస్మికముగా లోకమంతట నలమిన విపరీత ధర్మ మడంచుటకై యజ్ఞముల యందు పశువధ జరుగును గావున వానిని నాచరింపం గూడదు. ''అహింసాపరమో ధర్మః'' అను వాక్యము నందలి ననుసరింప వలయును భూతదయ కలిగి యుండ వలయునని ప్రకటించెను.

లోక కంటకులగు త్రిపురాసురల సంహారించు నప్పుడు శంకరుండు భూమిని రథముగాను సూర్య చంద్రు లను రథచక్రములుగాను బ్రహ్మను సారథిం గాను వేదము లను గుఱ్ఱముల గాను సముద్ర మమ్ముల పొదిగాను మేరు వును ధనువు గాను సర్పరాజు నల్లెత్రాడు గాను బుద్ధ రూప హరి బాణముగా నుపయోగించె, యుద్ధరంగము నందు ప్రాణాపహరణము బాణము వలననే జరుగుట లోక ప్రసి ద్ధము కావున విష్ణుమాయచే లోక కంటకులగు పై రక్క సులు నశించుట తెలియం జేయంబడినది. కోపము నిశ్శేష ముగా వదల వలయుననుట మాయాదూరుండై జాగ్రత్స్వప్న సుషుప్తులకగు స్థూల సూక్ష్మ కారణ శరీరముల యందం తర్యామి యగుట రహస్యము.

# కల్క్యవతారము

పాషండ కఠిన హృదయత్వము కలిగి మానవత్వ చిహ్నము లయిన తపస్సత్యదయా శౌచములు లేక సప్తవ్యసనలాల సత్వమునఁ కామాంధులై కన్నుగానక మిన్ను చూచుచు కాలనియమము లేక స్థూల శరీరరక్షణకై యభక్ష్య భక్షణ మొనర్చుచు బ్రమత్తతచేఁ బ్రాముకొని యరణ్యమునందు నుదగజములట్లు నిరంకుశత్వమునఁ జెలరేగుచు సర్పములట్లతి నిద్రాఘూర్ణిత నయనులై తూగుచు తూలుచు సాయుధ పాణులై నిర్నిమిత్తముగా సాధుజనస్త్రీ బాలవృద్ధుల నధించుచు రక్కసులట్లు లోకముల నాక్రమించిన యుష్కర తురుష్కులను కరవాలముచే శిక్షించెననుట వలన మహాపాపులగువారల స్వరూపములు మహాపాప ఫలము శరీరాంతర మందు గాక ప్రకృత శరీరమందే తెలియఁజేయఁ బడినది.

। మాళవరాగః – రూపక తాళః

ప్రళయపయోధిజలే ధృతవానసి వేదం
 విహితవహిత్రచరిత్ర మఖేదమ్
కేశవ! ధృతమీనశరీర! జయజగదీశ! హరే! (ధ్రువమ్) 1

క్షితిరతివిపులతరే తవ తిష్ఠతి పృష్ఠే
 ధరణిధరణకిణచక్రగరిష్ఠే
కేశవ! ధృతకచ్ఛపరూప! జయజగదీశ! హరే!॥ 2

వసతి దశనశిఖరే ధరణీ తవ లగ్నా
శశిని కళఙ్క కలేవ నిమగ్నా
కేశవ! ధృతసూకరరూప! జయజగదీశ! హరే!॥ 3

తవ కరకమలే నఖ మద్భుతశృఙ్గం
దళితహిరణ్యకశిపువరభృఙ్గమ్
కేశవ! ధృతనరహరిరూప! జయజగదీశ! హరే!॥ 4

ఛలయసి విక్రమణే బలి మద్భుతవామన!
పదనఖనీరజనితజనపావన!
కేశవ! ధృతవామనరూప! జయజగదీశ! హరే!॥ 5

క్షత్రియరుధిరమయే జగ దపగతపాపం
స్నపయసి పయసి శమితభవతాపమ్
కేశవ! ధృతభృగుపతిరూప! జయజగదీశ! హరే! ॥ 6

వితరసి దిక్షు రణే దిక్పతికమనీయం
దశముఖమౌళిబలిం రమణీయమ్
కేశవ! ధృతరామశరీర! జయజగదీశ! హరే॥ 7

వహసి వపుషి విశదే వసనం జలదాభం
హలహతిభీతిమిళితయమునాభమ్
కేశవ! ధృతహలధరరూప! జయజగదీశ! హరే॥ 8

నిన్దసి యజ్ఞవిధే రహహ ! శ్రుతిజాతం
సదయహృదయదర్శితపశుఘాతమ్
కేశవ! ధృతబుద్ధశరీర! జయజగదీశ! హరే॥ 9

మ్లేచ్ఛనివహనిధనే కలయసి కరవాలం
ధూమకేతుమివ కిమపి కరాలమ్
కేశవ! ధృతకలికిశరీర! జయజగదీశ! హరే॥ 10

శ్రీజయదేవకవే రిద ముదిత ముదారం
శ్రుణు శుభదం సుఖదం భవసారమ్
కేశవ! ధృతదశవిధరూప! జయజగదీశ! హరే। 11

# దశావతార సారాంశము

జల జంతువులలోను, స్థల జంతువులలోను మానవుల లోను, మిశ్ర శరీరములలోను, ద్విజులయందును, సర్వ వర్ణములయందును తపస్సత్యదయా శౌచాదికములయందును సర్వత్రసర్వదా బహిరంతరములయందు పరమేశ్వరశక్తి నిండి యుండుట ప్రస్ఫుటముగాఁ తెలియఁజేయబడుట రహస్యము.

శ్లో॥ వేదా నుద్ధరతే జగ న్నివహతే భూగోళ ముద్బిభ్రతే
దైత్యం దారయతే బలింఛలయతే క్షత్రక్షయంకుర్వతే
పౌలస్త్యం జయతేహలం కలయతేకారుణ్యమాతన్వతే
మ్లేచ్ఛాన్ మూర్ఛయతే దశాకృతికృతేకృష్ణాయ
తుభ్యం నమః॥

ఈ పద్య మందు గూడ దశావ తారము లనే వర్ణ నాంశము లేకుండ అవతార సారాంశమునే మిపుల నింపుగా వ్యాకరణ శాస్త్రమందలి దక్షతను శబ్ద ప్రయోగము నందు జూపుచు వివరించినాడు.

(హరి విజయ మంగళాచారము)

ఈ యష్టపదీనామమందు జయదేవకవి పాపములను హరించు శక్తి హరి శబ్దము వలనను సర్వకాలము సర్వ విషయములను సర్వ ప్రపంచమున తానే సర్వోత్కర్ష జెందుట విజయ శబ్దమువలనను మంగళాచార శబ్దమువలన సర్వలోక క్షేమాచరణ మువ్యక్తీ కరించెను.

ఘూర్జరీరాగః – నిస్సార తాళః

శ్రితకమలాకుచమణ్డల! ధృతకుణ్డల! ఏ
కలితలలితవనమాల!జయజయ! దేవ!హరే॥(ధ్రువమ్) 1

దినమణిమండలమణ్డన! భవఖణ్డన! ఏ
మునిజనమానసహంస! జయజయ! దేవ! హరే॥ 2

కాళీయవిషధరగఞ్జన! జనరఞ్జన! ఏ
యదుకులనలినదినేశ! జయజయ! దేవ! హరే! 3

మధుమురనరకవినాశన! గరుడాసన! ఏ
సురకులకేళినిదాన! జయజయ! దేవ! హరే! 4

అమలకమలదళలోచన! భవమోచన! ఏ
త్రిభువనభవననిధాన! జయజయ! దేవ! హరే! 5

జనకసుతాకుచభూషణ! జితదూషణ! ఏ
సమరశమితదశకంఠ! జయజయ! దేవ! హరే! 6

అభినవజలధరసుందర! ధృతమన్దర! ఏ
శ్రీముఖచన్ద్రచకోర! జయజయ! దేవ! హరే! 7

తవచరణే ప్రణతా వయ మితి భావయ! ఏ
కురు కుశలం ప్రణతేషు జయజయ! దేవ హరే॥ 8

శ్రీజయదేవకవే రిదం కురుతే ముదం ఏ
మఙ్గళ ముజ్జ్వలగీతం జయజయ! దేవ హరే॥ 9

ఈ యష్టపదీ గేయమునందు మొదట లక్ష్మీ నారాయణమూర్తిని సూర్యమండలాంతర్వర్తియైనదానిని అట కాళియమర్దన కృష్ణమూర్తిని సృష్ట్యాదిని మధు కైటభ సంహారమూర్తిని, గరుడవాహనారూఢ మూర్తిని, జటావల్కలధారి వనవాసి శ్రీరామ వీరమూర్తిని, కల్యాణ శృంగార రామమూర్తిని, శ్రీ క్షీరసాగరమథన కూర్మ మూర్తిని, శరణాగత భక్త రక్షణమూర్తిని, వాఙ్మయశిల్ప నైపుణ్యముచే మిక్కిలి హృదయంగమముగాఁ జిత్రించినాడు. సాకారమూర్తుల నిట్లు [illegible] ([illegible]!) (ముని జనమానస హంస) అను పదముల [illegible] చిదాకాశ సంచార

శీలురగు సంతర్ముఖులకు సర్వబంధ చ్ఛేదకరమైనదియు మజ్జాస్థి మేదో మలమూత్ర పాత్రమయిన గాత్రములందు దశేంద్రియములందు పంచకోశములందుసాక్షిత్వసత్త్వాత్మకమయి నిఖిలాంతర్యామియైన నిరాకారమును ప్రబోధించినాడు. (ఏకవింశత్యవతారముల యందును) రామకృష్ణావతారములయందే సకలోపనిషత్ప్రబోధిత పరిపూర్ణ పరతత్త్వము తెలియబడుట రహస్యము.

శ్లో॥ పద్మాపయోధరతటీ పరిరంభలగ్న
కాశ్మీరముద్రిత మురో మధుసూదనస్య
వ్యక్తానురాగ మివ ఖేలదనఙ్గఖేద
స్వేదామ్బుపూర మనుపూరయతు శ్రియం వః॥

అను శ్లోకములో లక్ష్మి కుచకుంకుమాంకిత మయిన విష్ణు వక్షస్థల మెట్టందనము లోపలి యనురాగముగా పైకి ప్రకటింపఁబడినది మఱియు వసంతర్తువున లతాతరులు చివుళ్లు తొడుగుట సూచింపఁబడినది అనురాగ మరుణవర్ణ మగుట కవిసమయము క్రీడలయందు చెమటపోయుట ఋతు చిహ్నము.

శ్లో॥ వసంతే వాసంతీకుసుమసుకుమారై రవయవై
ర్భ్రమంతీం కాంతారే బహువిహితకృష్ణానుసరణాం,
అమన్దం కన్దర్పజ్వరజనితచిన్తాకులతయా
వలద్బాధాం రాధాం సరస మిద మూచే సహచరీ॥

అను శ్లోకములో వసంతమున నాయకుని యెడబాటు నాయికకు దుస్సహమగుట అందువలన నాయకునికై నిరంత నిరీక్షణము వనసంచారమును సహజములగుట సూచింప బడినది.

## ౩ మాధవోత్సవ కమలాకరము

ఈ నామమువలన వైశాఖమునకు మాధవశబ్ద మొప్పుటవలన వసంతర్తువు సూచింపఁబడినది మాధవుఁ డనఁగా శ్రీకృష్ణుడు వసంత కృష్ణుల యుత్సవముల కమల లక్ష్మికి ఆకరము స్థానమైనది. అనియు సూచింపఁబడినది.

వసన్తరాగః - యతితాళః

లలితలవంగలతాపరిశీలనకోమలమలయసమీరే
మధుకరనికరకరమ్బితకోకిలకూజితకుఞ్జకుటీరే
విహరతి హరి రిహ సరసవసన్తే నృత్యతి యువతిజనేనసమమ్
సఖి! విరహజనస్య దురన్తే॥ (ధ్రువమ్) 1

ఉన్మదమదనమనోరథపథికవధూజనజనితవిలాపే
అలికులసంకులకుసుమసమూహనిరాకులవకులకలాపే॥ 2

మృగమదసౌరభరభసవశంవదనవదళమాలతమాలే
యువజనహృదయవిదారణమనసిజనఖరుచికింశుకజాలే॥ 3

మదనమహీపతికనకదణ్డరుచి కేసర కుసుమవికాసే
మిళితశిలీముఖపాటలపటలకృతస్మరతూణవిలాసే॥ 4

విగళితలజ్జితజగదవలోకనతరుణకరుణకృతహాసే
విరహినికృంతనకుంతముఖాకృతి కేతకదంతురితాశే॥ 5

మాధవికాపరిమళలలితే నవమాలతిజాతిసుగంధౌ
మునిమనసామపి మోహన కారిణితరుణాఽకారుణబంధౌ॥ 6

స్ఫురదతిముక్తలతాపరిరంభణముకుళితపులకితచూతే
బృందావనవిపినే పరిసరపరిగతయమునాజలపూతే॥ 7

శ్రీజయదేవభణిత మిద ముదయతి హరిచరణస్మృతిసారమ్
సరసవసన్తసమయవనవర్ణన మనుగతమదనవికారమ్॥ 8

యమునా పరిసరమునందలి పూదోటల యందు లవంగలత లుపొగడలు కానుగులు మోదుగలు కేసరములు పొదిరులు, కరుణ తరువులు మొగలిజాజి గురివెందమాలతి మొదలయిన లతలు తరువులు చిగిర్చుటను పూయుటను తుమ్మెదలు పూఁదేనియలగ్రోలి ఝుంకారములు సేయుటను. మలయమారుతము హాయిగా వీచుట యెడబాటుగల నాయికలు దుఃఖించుట నిస్స్పృహులయిన మునులకును మదనదాస్యమగుట, యువకులు కామోద్రిక్తులగుటయుఁ దెలియఁ జేయఁబడినది. స్ఫురదతిముక్త లతాపరిరంభ ముకుళితపులకితచూతే. అను పదప్రయోగమువలన లతా తరువులందున్న నాయికా నాయకత్వము వివరింపబడినది,

బృందావనమందు గోపీయువతులతో కృష్ణుడు విలాసముగా నాట్యమొనరించుచున్నాడు. స్త్రీ సంఘముతో విహరించు వానికి నీవెట్లు జ్ఞప్తికివత్తువు కావున నీవేయచ్చటకు పొమ్మనియు జెలికత్తె రాధతో చెప్పుట విశదీకరింపఁ బడినది. తనచే సృజింపబడిన విశ్వమందు జీవదశయందుండుట పరమాత్మను మూలప్రకృతి వెంటనుండియు విస్మృతిజెంద స్వాభిన్నజ్ఞానము ప్రబోధస్థానమందుండుట రహస్యము.

శ్లో॥ దరవిదళితమల్లీవల్లిచంచత్పరాగ
ప్రకటితపటవాసై ర్వాసయ న్కానానాని,
ఇహ హి దహతి చేతః కేతకీగంధబంధుః
ప్రసరదసమబాణప్రాణవ ద్గంధవాహః॥

యను శ్లోకమువలన పూర్వాష్టపదియందుఁ జెప్పిన మొగలిని విశేషించి చెప్పినాడు. మొగలిపూల చెండ్లలోని పూదుమారము మల్లెపూవుల పరాగము మలయమారుతము తాకుచే పూ దోటలయందలి నెత్తావి తాత్కాలికము మాత్రము గాక సార్వకాలిక మగుటవలన విరహులకు దుస్సహమనుట సూచింపఁబడినది.

శ్లో॥ ఉన్మీల న్మధుగంధలుబ్ధమధుప వ్యాధూత చూతాంకుర
క్రీడత్కోకిలకాకలీకలరవై రుద్గీర్ణకర్ణజ్వరాః
నీయన్తే పథికైః కథం కథమపి ధ్యానానుధానక్షణ
ప్రాప్తప్రాణ సమాసమాగమరసోల్లాసై రమీ వాసరాః

అను శ్లోకమున మలయపర్వతమున సువాసనకై నిరంతరము సర్పములు వసించుట వానికి మలయమారుత మాహారమగుట విషసంబంధము వలన వడగాలియై హిమవత్పర్వతముఁజేరి మంచునీటి ముక్కలచే నెప్పటియట్లు చల్లందనము సంపాదించుకొనుట గండుకోయిలలు క్రొమ్మావి పులను చూచుమాత్రమున కుహో కుహో యను పంచమధ్వనులచే మహానంద పారవశ్యమునొందుట వసంతలక్షణమని వివరింపఁబడినది.

మకరంద మాధుర్యమునకు గండు తుమ్మెదలు మూగిన మావిచెట్లపై కోయిలల పంచమస్వరముల విరహులు వినుటకు దుస్సహామగుట సూచింపఁబడినది.

శ్లో॥ అనేకనారీపరిరంభసంభ్రమ
స్ఫురన్మనోహారివిలాసలాలసమ్
మురారి మారా దుపదర్శయ న్త్యసౌ
సఖీసమక్షం పున రాహ రాధికా॥

సఖీప్రచోదితయగు రాధ గోపీజవమందు రాసక్రీడా పరవశుడగు శ్రీకృష్ణుని జూచుచు తానచ్చటకు వోవుటకు లజ్జించి చూపుడుప్రవేలితో దగ్గఱనున్న చెలికత్తెకు చూపుట చెప్పుట విశదీకరింపఁబడినది.

# సామోద దామోదర భ్రమరపదము

ఈ యష్టపదీ నామమువలనవసంత ఋతువునందు సువాసన పుష్పములకు ప్రాచుర్యముగాను పూలదండలలోని మధ్యభాగము భ్రమరములకు స్థానమనియు సూచింపఁబడినది. యమునాతటమున వివిధపద విలాసభాసుర మృదుపద న్యాసముతో శ్రీకృష్ణుఁడు విహరించుటకు స్థానమైనదియు సూచింపఁబడినది.

4 రామక్రియారాగః — యతితాళం

వ॥ హరిరిహ ముగ్ధవధూనికరే; అ॥విలాసిని! విలసతి కేళిపరే॥

చన్దనచర్చితనీలకళేబరపీతవసనవనమాలీ
కేళిచలన్మణికుణ్డలమండిత గణ్డయుగస్మితశాలీ 1

పీనపయోధరభారభరేణ హరిం పరిరభ్య సరాగమ్
గోపవధూరనుగాయతి కాచిదుదఞ్చితపంచమరాగమ్ 2

కాఽపి విలాసవిలోలవిలోచన ఖేలనజనితమనోజమ్
ధ్యాయతిముగ్ధవధూరధికంమధుసూదనవదనసరోజమ్ 3

కాఽపి కపోలతలే మిళితా లపితుం కిమపి శ్రుతిమూలే
కాఽపిచుచుమ్బనితంబవతీదయితం పులకైరనుకూలే 4

కేళికలాకుతుకేనచ కాచి దముం యమునాజలకూలే
మఞ్జులవఞ్జులకుఞ్జగతం విచకర్ష కరేణ దుకూలే 5

కరతలతాళతరళవలయావళి కలితకలస్వనవంశే
రాసరసేసహ నృత్యపరా హరిణా యువతిః ప్రశశంసే 6

శ్లిష్యతి కామపిచుంబతి కామపిరమయతి కామపిరామాం
పశ్యతిసస్మితచారుపరామపరామనుగచ్ఛతివామామ్ 7

శ్రీజయదేవభణిత మిద మద్భుత కేశవకేళిరహస్యం
బృందావనవిపినే లలితం వితనోతు శుభానియశస్యమ్ 8

మంచిగంధపుబూత పరిమళింప తొలుకారుమబ్బు వంటి శరీరమందు మెఱుపుదీగ వలెఁ దళ్కు-మను పీతాంబరము మెఱయఁగాఁ జెవి కొనల యందలి రత్నకుండల కాంతులు చెక్కి-ళ్లను వ్యాపించి చిఱునగవుతోఁ గలియ ఠీవి గలిగి రాసక్రీడా మండలో న్ముఖుండయిన శ్రీకృష్ణ భగవానుని దివ్యమంగళ విగ్రహ ప్రత్యేకతను మిపుల రమణీయముగా వర్ణించినాడు

(శుద్ధస్ఫటిక సంకాశుఁడై సాంద్రానందమున మెఱయు వాఁడగుట రహస్యము,

2. అనురాగముచేతను హత్తుకొని తాను పాడెడు పిల్లనగ్రోవిని పాటకు సూటిగా సాగించు రాగము బాడెడు నిండుజవ్వనియగు నొక గోపికతోనుండు శ్రీకృష్ణభగవానును ల్లేఖించినాడు. (ప్రణవనాద సమ్మేళనము రహస్యము)

3. పద్మాసనమునందుండి కన్నాపల త్రిప్పుచే పద్మలోచనుని పద్మముఖమును ధ్యానము చేయుచున్న యొక గోపికను చిత్రించినాఁడు.

(భగవంతుఁడు ధ్యానగమ్యుఁడగుట రహస్యము.

4. చెక్కిలి చెక్కిలిని జేర్చి యేమియో చెవిలోనఁ జెప్పఁబోవు నెపముచే శరీరము గగ్గురుపాటుదోప ముద్దాడుచున్నట్లు లొక గోపికను కట్టెదుట నిలబెట్టినాఁడు. (భగవద్రహస్యము గురు ముఖముననే తెలియఁదగిన దనుట రహస్యము).

5. రాసక్రీడాభిరుచిచే కరతాళ ధ్వనులకు కంకణ ధ్వనులు తోడుగా నాట్యమొనర్చు నొక గోపికను కనులకు జూపినాడు.

(ఆనంద పారవశ్యమున సర్వ హృదయాంతరాళముల యందును రమించుట (రహస్యము).

6. విహారమందయిన వేడుకచే యమునాజల క్రీడా లోలయయి యమున యొడ్డునుండి పరిసరపు బొదరింటి యందున్న శ్రీకృష్ణుని చేలచెఱగును ముంజేత నాకర్షించు నొక గోపికను వాఙ్మయ పటమున వ్రాసినాడు. (శ్రీకృష్ణ పరమాత్మను తన దివ్యశక్తియే ప్రపంచ ముఖమునకు దెప్పుట రహస్యము.)

7. శ్రీకృష్ణుఁడు ప్రతిగోపిక యొనర్చు శృంగార చేష్టలకు తా ననుకూలుఁడై ప్రతిక్రియ లొనరించుచున్నట్లు లొక చిత్రమయిన చిత్తరువును బృందావన యవనికతోఁ గూడ బ్రదర్శించినాఁడు.*

(జగన్నాటక సూత్రధారిత్వము పరమ రహస్యము.)

శ్లో॥ విశ్వేషా మనరంజనేన జనయ న్నానంద మిందీవర
శ్రేణీశ్యామలకోమలై రుపనయ న్నంగై రనంగోత్సవమ్
స్వచ్ఛందం వ్రజసుందరీభి రభితః ప్రత్యఙ్గ మాలిఙ్గితః
శృంగారస్సఖి! మూర్తిమానివమధౌముగ్ధో హరిః క్రీడతి॥

ఇందు రాసక్రీడయొసర్చు కృష్ణుఁడు మూర్తిని ధరించిన వసంతర్తువునందలి శృంగార రసముగా శృంగారించినాఁడు.

శ్లో॥ నిత్యోత్సంగవసద్భుజంగకబలక్లేశా దివేశాచలం
ప్రాలేయప్లవనేచ్ఛ యాఽనుసరతి శ్రీఖండశైలానిలః
కించ స్నిగ్ధరసాలమౌళిముకుళా న్యాలోక్య హర్షోదయా
దున్మీల న్తి 'కుహూకుహూ' రితికలోత్తాలాః పికానాంగిరః

## (రాసక్రీడ) యనఁగా

గోపిక ప్రక్క కృష్ణుఁడు కృష్ణుని ప్రక్క గోపిక వరుసగా వలయాకారముగా తౌర్యత్రికమునఁ బ్రవర్తించుట.

(ఈ శ్లోకభావము (28) పేజీలో కలదు)

శ్లో॥ రాసోల్లాసభరేణ విభ్రమభృతా మాభీరవామభ్రువా
మభ్యర్ణం పరిరభ్య నిర్భరమురః, ప్రేమాన్ధయా రాధయా
'సాధుత్వద్వదనం సుధామయ' మితి వ్యాహృత్య గీతస్తుతి
వ్యాజా దుత్కటచుంబితస్మితమనోహారీహరిః పాతువః॥

తొలుదొల్త గోపికామండలిలో రసనిమగ్నుఁడైన శ్రీకృష్ణనాయకుని సమీపించుటకు సిగ్గిలినను గోపికలను చేరుటకు ముందే రాధకు కలచనవు నాకస్మికముగాఁ బొనరించిన చుంబనమునకయి కృష్ణుఁడొనరించిన చిఱు నగవుచే దెలియఁ జేసినాడు.

శ్లో॥ విహరతి వనే రాధా సాధారణప్రణయే హరౌ
విగళితనిజోత్కర్షా దీర్ష్యావశేన గతాన్యతః,
క్వచి దపి లతాకుంజే గుంజన్మధువ్రతమండలీ
ముఖరశిఖరే లీనా దీనాప్యువాచ రహః సఖీమ్॥

ఇందు గోపికా సమక్షమున తనకు గలచనవును తెలియఁ జేసినను కృష్ణుడు తన్నొల్లకనగు బాటొర్చుట బహిఃప్రాణమయిన చెలికత్తెతో నేకాంతముగా రాసక్రీడ యందలి కృష్ణభగవానుని వివిధ విలాస రూప ప్రదర్శనము నెఱిగించుట సూచింపఁబడినది.

మధురిపురత్నకంఠిక

ఈ నామము వలన బృందావన మండలమున వల యాకారమైన గోపీ సహస్రము రత్నమాలగాను అందు శ్రీకృష్ణభగవానుఁడు వివిధ రత్నఖచిత పదకముగా సూచింపఁబడినది,

## అష్టపది 5. మధురిపు రత్నకంఠిక

(తోడి - ధన్యాసి - దేశాక్షురి - ఆది)

ఘూర్జరీరాగః యతితాళః

ప॥ రాసే హరి మిహ విహితవిలాసం॥ అ॥ స్మరతి మనో మమ కృతపరిహాసం॥

సంచలదధరసుధామధురధ్వనిముఖరిత మోహనవంశమ్
చలితదృగంచలచంచలమౌళికపోలవిలోలవతంసమ్॥ 1

చంద్రకచారుమయూరశిఖండకమణ్డలవలయిత కేశమ్
ప్రచురపురందరధనురనురంజిత మేదురముదిరసువేషమ్॥ 2

గోపకదమ్బనితమ్బవతీముఖచుమ్బనలమ్బితలోభమ్
బన్ధుజీవమధురాధరపల్లవకలితదరస్మితశోభమ్॥ 3

విపులపులకభుజపల్లవవలయితవల్లవయువతిసహస్రం
కరచరణోరసి మణిగణభూషణకిరణవిభిన్నతమిస్రమ్॥ 4

జలదపటలచలదిన్దువినిన్దకచన్దనబిన్దులలాటం
పీనపయోధరపరిసరమర్దననిర్దయహృదయకవాటమ్॥ 5

మణిమయమకరమనోహరకుణ్డలమణ్డితగణ్డ ముదారం
పీతవసన మనుగతమునిమనుజసురాసురవరపరివారమ్॥ 6

విశదకదమ్బతలే మిళితం కలికలుషభయం శమయంతం
మామపి కిమపి తరఙ్గదనఙ్గదృశా మనసా రమయంతమ్॥ 7

శ్రీజయదేవభణిత మతిసున్దర మోహనమధురిపురూపం
హరిచరణస్మరణం ప్రతిసంప్రతి పుణ్యవతామనురూపమ్॥ 8

ఇంద్రధనుస్సువలె వివిధవర్ణములు గల నెమలి పించి యము కలికితురాయిగ రాణించు నలకలుఁగల తల యొకింత యోరగా నొయ్యారముగా ద్రిప్పుచును, అధరామృత పూర ణముచే మధుర మోహన మురళిని మ్రోయించుచు చెక్కిళ్ల యందు నిడు వాల్చూపులు ప్రసరింపగా, కర్ణావతంసము గాలికి చలించుచుండగా, అలకలు క్రమ్మిన నుదుటఁ జందన తిలకము కదలు మబ్బులలోని చంద్రమండలమట్లు ప్రకా శించుచుండఁగా, మంకెనపూవువంటి కెమ్మోవియందు మల్లె పూవువంటి చిఱునవ్వు పర్వుచుండ, కరకంకణ కాంతులు వక్షస్స్థల హారకాంతులు చరణ మణినూపుర కాంతులును చిమ్మచీకట్ల పటాపంచలు గావింప మైగగ్గురుపాటుజెంద బుజములుహత్తు గోపీసహస్రము కలవానిని, భక్తాభయ ప్రదాన నిపుణుఁడైనవాని పీతాంబరము కటిస్థలమునఁ బ్రకా శించువాని దేవర్షి దానవులు సేవించువాని కడిమిమ్రాని మూల మందు పొలుచువాని రాధాదేవిని తెంపులేక కటాక్షించు వాని, చక్కనైనవారిలో మిగుల చక్కనైనవానిని శ్రీకృష్ణ భగవానుని పుణ్యాత్ముఁడైన పాఠకున కెదురుగా సాక్షాత్క రింపఁ జేసినాడు.

శ్లో॥ గణయతి గుణగ్రామం భ్రామం భ్రమాదపి నేహతే
వహతి చ పరితోషం దోషం విముంచతి దూరతః

యువతిషు వలత్తృష్ణే కృష్ణే విహారిణి మాం వినా
పున రపి మనోవామం కామం కరోతి కరోమి కిం

శ్రీకృష్ణుడు, తనదగ్గర జేరినను తనవంకకైనజూడక గోపికామండలితోనే యూగుచున్నను నామనము కోపింపక యెపరుగెత్తుచున్న దనుటవలన నిరూఢమైతైల ధారవలె నవిచ్ఛిన్నమైన రాధాదేవి యనన్యభక్తి కృష్ణుని యెడ గలిగియుండుట సూచింపఁబడినది.

## అక్లేశకేశవ మంజరీ తిలకము

దీనిలోని పదములవలన నిరతిశయాఖండానందరసమను భూతితో త్రిమూర్తి స్వరూపుడు శ్రీకృష్ణుడు శ్రీకృష్ణుఁడగుట సూచింపఁబడినది. రాధకు శ్రీకృష్ణున కీయవతారమందేగాక సర్వావతారములయందు సర్వావయవవిలాస శృంగార కలాశక్తియనుభూతి సమగ్రత మృదుమధుర పదములతో కేవల లౌకిక మానవ నాయికా నాయకుల సంభోగ శృంగారమట్లు బాహ్యమున బ్రకటమగుచున్నది, (ఆత్మజ్ఞాన ప్రబోధముచే తనే ప్రకృతి పురుషుల కైక్యము కలుగుట రహస్యము)

శ్లో॥ హస్తస్రస్తవిలాశవంశ మనృజుభ్రూవల్లి మద్వల్లవీ
బృందోత్సారిదృగంతవీక్షిత మతిస్వేదార్ద్రగణ్డస్థలమ్,
మా ముద్వీక్ష్య విలజ్జితం స్మితసుధాముగ్ధాననం కాననే
గోవిందం వ్రజసుందరీగణావృతంపశ్యామి హృష్యామిచ॥

అష్టపది - 6. అక్లేశ కేశవ కుంజకేళి తిలకము

గుణక్రియా రాగః - ఏక తాళః

ప॥ సఖి!, హే కేశిమథనముదారం॥

అ॥ రమయ మయా సహ మదన మనోరథ భావితయా సవికారం॥

నిభృతనికుంజగృహం గతయా నిశి రహసి నిలీయ వసంతం
చకిత విలోకిత సకలదిశా రతిరభసభరేణ హసంతం।

ప్రథమసమాగమలజ్జితయా పటుచాటుశతైరనుకూలం
మృదుమధురస్మితభాషితయా శిథిలీకృతజఘనదుకూలమ్॥

కిసలయశయననివేశితయా చిర మురసి మమైవ శయానం
కృతపరిరంభణచుంబనయా పరిరభ్య కృతాధరపానమ్॥

అలసనిమీలితలోచనయా పులకావలి లలితకపోలం
శ్రమజలసకలకళేబరయా వరమదనమదా దతిలోలమ్।

కోకిలకలరవకూజితయా జితమనసిజతంత్రవిచారం
శ్లథకుసుమాకులకుంతలయా నఖలిఖితఘనస్తనభారం॥

చరణరణితమణినూపురయా పరిపూరితసురతవితానం
ముఖరవిశృంఖలమేఖలయా సకచగ్రహ చుంబనదానమ్॥

రతిసుఖసమయరసాలసయా దరముకుళితనయనసరోజం
నిస్సహనిపతితతనులతయా మధుసూదనముదితమనోజం॥

శ్రీ జయదేవభణిత మిద మతిశయమధురిపునిధువనశీలం
సుఖ ముత్కంఠితగోపవధూకథితం వితనోతు సలీలమ్॥

రాధకృష్ణునకు తనయెడఁ దనకుఁ బలెగాఢానురాగ మున్నట్లు తన్నుఁజూచుచు చేనున్న మురళి జార్చుట చిఱునవ్వు వెలిబుచ్చుట క్రీగంటఁజూచుట మొదలైన లక్షణములచే సూచింపఁ బడినది.

శ్లో॥ దురాలోకస్తోక స్తబకనవకాశోకలతికా
వికాసః కాసారోపవనపవ నోఽపి వ్యథయతి,
అపి భ్రామ్యద్భృంగీరణితరమణీయా న ముకుళ
ప్రసూతి శ్చూతానాం, సఖి!, శిఖరిణీయం సుఖయతి॥

విరహులకు అశోకవృక్ష వికాసము, పూఁదోటలు సరస్సులు, మామిడిపూత తుమ్మెదల ఝుంకారములు దుస్సహములగుట సూచింపఁబడినది.

శ్లో॥ సాకూతస్మిత మాకులాకులగళ ద్ధమ్మిల్ల ముల్లాసిత
భ్రూవల్లీక మళీకదర్శితభుజా మూలోర్ధ్వహ స్త స్తనం
గోపీనాం నిభృతం నిరీక్ష్య గమితా కాంక్షశ్చిరంచి న్తయ
న్నంతర్ముగ్ధమనోహరం హరతునః క్లేశంనవః కేశవః॥

దీనివలన గోపికలు చిఱునవ్వు నవ్వుచున్నట్లు క్రొమ్ముడులు వీడి పూలు రాలుచున్నట్లు కను బొమలు పొడిగించి రెండుచేతులు పైకెత్తి వలయాకారముగా నొండొంటి మేళవించు చున్నట్లు ఒయ్యారముగాఁ గృష్ణునిఁ జూచుచున్నట్లు చిత్రము చిత్రింపఁబడినది.

# ముగ్ధ మధుసూదన హంస క్రీడనము

తనవద్దకువచ్చి ప్రార్థించినను రాధ తానంగీక రింపదు, పొదరిండ్లయందు డాగెను. ప్రత్యక్షమందు లేక పోవుటచే నేత్రపిపాస (దిదృక్షు) అని వేలగోపికలయందు డాఁజేసిన లోపములఁ బ్రకటించుకొనుచు మాయాతీతుఁ డయ్యు మానవప్రకృతిని గాఢవిచారమును చూపుటవలన నీ నామము సార్థకను.

హంసక్రీడనమనగా నిట్టూర్పువదలుట బాహ్యము సోహంధ్వా న్యాత్మకమ జపము రహస్యము.

శ్లో॥ కంసారి రపి సంసారవాసనా బంధశృంఖలామ్,
రాధామాధాయ హృదయే తత్యాజ వ్రజసుందరీః॥

అద్వైతాత్మశక్తితో రమింపఁదలచి యసంఖ్యాక మయిన విశ్వప్రపంచమును వదలుట సూచింపఁబడినది.

శ్లో॥ ఇత స్తతస్తా మనుసృత్య రాధికా
మనంగబాణ వ్రణ ఖిన్న మానసః
కృతానుతాప స్స కళిందనందినీ
తటాంతకుంజే విషసాద మాధవః ॥

సన్నిహితమై యే పోకలకుపోక నిత్యాఖండ బోధా మత సుఖమగు స్వాత్మశక్తిని తెలిసికొనజాలక జీవత్వాదశ విచార సాగరమునఁ బడినట్లు తెలియఁజేయఁజడినది,

7 ముగ్ధమధుసూదన హంసక్రీడనము

(ఘూర్జరీ (భూపాల) రాగః యతి (ఆది) తాళః

ప॥ హరి! హరి! హతాదరతయా॥ అ॥ సా గతా కుపితేవ॥

మామియం చలితా విలోక్య వృతం వధూనిచయేన,
సాపరాధతయా మయాఽపి న వారితాఽతిభయేన॥ 1

కిం కరిష్యతి ? కిం వదిష్యతి ? సా చిరం విరహేణ,
కిం ధనేన ? జనేన కిం ? మమ జీవితేన గృహేణః 2

చింతయామి తవాననం కుటిలభ్రు ! కోపభరేణ
శోణపద్మ మివోపరిభ్రమ తాఽఽకులం భ్రమరేణ॥ 3

తా మహం హృది సంగతా మనిశం భృశం రమయామి
కిం వనేఽనుసరామి తా మిహ కింవృథా విలపామి?॥ 4

తన్వి ! ఖిన్న మసూయయా హృదయం తవాకలయామి
తన్న వేద్మి కుతో గతాఽసి? న తేన తేఽనునయామి॥ 5

దృశ్యసే పురతో గతాగత మేవ మే విదధాసి
కిం పురేవ ససంభ్రమం పరిరంభణం న దదాసి ? ॥ 6

క్షమ్యతా మపరం కదాపి తవేదృశం న కరోమి
దేహి సుందరి! దర్శనం మమ మన్మథేన దునోమి॥ 7

వర్ణితం జయదేవకేన హరే రిదం ప్రవణేన
బిందుబిల్వసముద్రసంభవరోహిణీరమణేన॥ 8

కృష్ణుఁడు తన్నాదరింపమి రాధ యంతర్ధానమందెను. కృష్ణుఁ డప్పు డడ్డగింపలేదు. కొంతకాలము చన పశ్చాత్తప్తుఁడై రాధ విరహాశృశాంగియై మాఱుపల్కు పల్క లేకుండుట ధన కనక వస్తువాహన సంపన్నంబగు కాపురము వలన నేమి ప్రయోజనమని కోపమువచ్చిన సమయమున నాయికాప్రకృతి భయంకరమగుట, తన హృదయములోనే యున్నదాని నితరత్ర యన్వేషించుట హాస్యాస్పదమగుట కృష్ణుఁ డాత్మశక్తికి విధేయుఁడగుట. అన్యోన్య సమైక్యాభిలాష గలుగుట లోకసృజన పరిపాలనాది కార్య వ్యగ్రతచే జీవత్వదశయందు తా నలసి సొలసి తిరిగి తన్ను తానే తెలియుట.

శ్లో॥ హృది బిసలతాహారో నాయం భుజంగమనాయకః
కువలయదళశ్రేణీ కంఠే న సా గరళద్యుతిః
మలయజరజో నేదం భస్మ, ప్రియారహితే మయి
ప్రహరసి హర భ్రాంత్యాఽనంగ,! క్రుధాకిముధావసి!॥

తామరతూండ్లు, పాములు నల్వ గల్వరేకులు విషము కాంతి మంచిగంధము బూది యుపమానోపమేయములుగా జూపఁబడినవి. విరహిజన దుస్సహాములగుట శైత్యోపచార సామగ్రిగా తేట పఱుపఁ బడినది. కామము నిరవయవ మగుట అనంగ శబ్దముచే స్ఫుటీకరింపఁ బడినది. కృష్ణునకు శివునకు గల యభేదత్వము తెలియఁ జేయఁ బడినది.

శ్లో॥ పాణౌ మా కురు చూత సాయక మముం మా చాప మారోపయ
క్రీడానిర్జితవిశ్వ!, మూర్ఛితజనాఘాతేన కిం పౌరుషం?,
తస్యా ఏవ మృగీదృశో మనసిజ ప్రేంఖత్కటాక్షాశుగ
శ్రేణీజర్ఘరితం మనాగపి మనో నాద్యాపి సంధుక్షతే॥

విరహులకు చెఱకురసము మామిడి చివుళ్లు మొదలయినవి వికార హేతువులని తెలియ జేయఁ బడినది. చూపులందు బాణత్వ ధర్మము వ్యంగ్యమునం దున్నది.

శ్లో॥ భ్రూపల్లవం ధను రపాఙ్గతరఙ్గితాని
బాణా, గుణ శ్రవణపాళి రితి స్మరేణ
తస్యా మనఙ్గజయజఙ్గమ దేవతాయా
మస్త్రాణి నిర్జితజగంతి కి మర్పితాని॥

పదునాల్గు భువనములందును రాధికవంటి సౌందర్యము కలది యగుట కామునకు ప్రాంభికత్వము నిజస్తుతియు సహజమగుట తెలియ జేయబడినది.




శ్లో॥ భ్రూచాపే నిహితః కటాక్షవిశిఖో నిర్మాతు మర్మవ్యథాం
శ్యామాత్మా కుటిలః కరోతు కబరీ భారోపి మారోద్యమమ్,
మోహంస్తావదయంచ, తన్వి! తనుతాం బింబాధరో రాగవాన్
సద్వృత్త స్తనమణ్డల స్తవ కథం ప్రాణైర్మమ క్రీడతి?॥

రాధికాదేవి కామశక్తియగుట చిద్రూపమున సర్వలోకముల విహరించుట తెలియఁ జేయ బడినది.

శ్లో॥ తాని స్పర్శసుఖాని, తేచసరళాః స్నిగ్ధాదృశోవిభ్రమాః
తద్వక్త్రాంబుజసౌరభం, సచసుధాస్యందీగిరాంవక్రిమా,
సా బింబాధరి! మాధురీతి విషయాసంగేపి చేన్మానసం
తస్యాంలగ్నసమాధి, హంత!విరహవ్యాధిఃకథంవర్ధతే?॥

రాధాదేవి కభయహస్త స్పర్శనము దివ్యపరిమళము, చల్లనికటాక్షములు మధురభాషణము జగన్మంగళకరము లగుట ప్రకటింపబడినది.

శ్లో॥ తిర్యక్కంఠవిలోలమౌళి తరళోత్తంసస్య వంశోచ్చల
ద్దీప్తిస్థానకృతావధానలలనాలక్షైర్న సంలక్షితాః
సంముగ్ధే! మధుసూదనస్యమధురేరాధాముఖేందౌసుధా
సారేకందళితాశ్చిరందదతునఃక్షేమంకటాక్షోర్మయః॥

వేణుగానమువలన సర్వచిత్తాకర్షణము. అలంకృత రాసక్రీడా మహోత్సవ గోపీమండల మధ్యమునందున్నను శ్రీకృష్ణుని తృప్తిస్థానము రాధయేయగుట తెలియబడినది.

# హరివల్లభాశోకపల్లవము

ఈ నామముచే రాధాకృష్ణులు ప్రకృతి పురుషులగుట గోపీజనాసక్తిచే తన్నెడయుటనైన విచారము పొరలి పొరలి వచ్చుట సంధివశమున ఆకారము స్ఫురించుట వసంతర్తు సంబంధియగు నశోకవృక్షము చిగిర్చుటయు శ్లేషించుచున్నది.

శ్లో॥ యమునా తీరవానీర నికుంజే మంద మాస్థితమ్,
ప్రాహ ప్రేమభరోద్భ్రాంతం మాధవం రాధికాసఖీ॥

ఇందు రాధ చెలికత్తె యమునయొద్దనున్న ప్రబ్బలి పొదరింటిలోని కృష్ణునితో రాధాసందేశము చెప్పుట తెలుపబడినది.

(సౌరాష్ట్రి, కానడ) రాగం–ఆది (ఏక తాళః)

ప॥ సా విరహే తవ దీనా॥ అ॥ మాధవ!
మనసిజవిశిఖభయా దివ భావనయా తవ లీనా!

నిందతి చందన మిందుకిరణ మను విందతి ఖేద మధీరమ్
వ్యాళనిలయమిళనేన గరళ మివ కలయతి మలయసమీరమ్
అవిరళనిపతితమదనశరా దివ భవదవనాయ విశాలమ్
స్వహృదయమర్మణి వర్మ కరోతి సజలనళినీదళజాలమ్ ॥సా॥
కుసుమవిశిఖశరతల్ప మనల్పవిలాసకలాకమనీయం
వ్రత మివ తవపరిరంభసుఖాయ కరోతి కుసుమశయనీయమ్

వహతి చ వలితవిలోచనజలధరమాననకమల ముదారం
విధు మివ వికటవిధుంతుదదంతదళనగళితామృతధారమ్
వివిఖతి రహసి కురంగమదేన భవంత మసమశరభూతం
ప్రణమతి మకర మథో వినిధాయ కరే చ శరం నవచూతమ్
ధ్యానలయేన పురః పరికల్ప్య భవ న్తమతీవ దురాపం
విలపతి హసతి విషీదతి చంచతి ముంచతి తాపమ్॥
ప్రతిపదమిదమపినిగదతి,మాధవ!, తవచరణేపతితాఽహం
త్వయివిముఖేమయిసపది సుధానిధి రపి తను తే తనుదాహమ్
శ్రీజయదేవభణిత మిద మధికం యది మనసా నటనీయం
హరివిరహాకులవల్లవయువతిసఖీవచనం పఠనీయమ్

యమునానదీ పరిసరమున నొక పొదరిల్లు అందు శరతల్పాకృతి పూలపాన్పు దానిపై రాధాదేవి నలువంకల విరహతాపోపశమనములగు మంచిగందపుగిన్నె తామర పాకులు కన్పింప కన్నీరు తోఁగుచున్నట్లు శిల్పకలా నైపుణ్యమునొఁదయ కృష్ణుని మన్మథునిగా చేతియందు క్రొమ్మావిచివురుంచి క్రిందిభాగమున మొసలియాకారమును లిఖించుచున్నట్లు అరమోడ్పుఁగను తమ్ములతో ధ్యాన యోగమున శ్రీకృష్ణుని జూచుచున్నట్లు కొంతసేపు నవ్వు చున్నట్లు కొంతసేపు విచారపడుచున్నట్లు తాను కస్తూరిచే చిత్రించి కృష్ణపరమాత్మను సాష్టాంగ నమస్కారము చేయు

చున్నట్లు విరహకృశాంగియగు రాధను కనులకు పొడగట్టఁ జేసెను,

శ్లో॥ ఆవాసో విపినాయతే, ప్రియసఖీ మాలాపి జాలాయతే,
తాపో నిశ్వసితేన దావదహన జ్వాలాకశాళాయతే,
సాఽపిత్వద్విరహేణ, హంత! హరిణీరూపాయతేహా!కథం?
కందర్పోపి యమాయతే విరచయన్ శార్దూలవిక్రీడితమ్॥

విరహులకు నివాసస్థానము మహారణ్యముగా ప్రాణసఖులు బంధముగా నాసారంధ్రములనుండి వెడలు నిట్టూర్పులు మండువేసవి పడమటిగాడ్పుగా నుండుట సూచింపఁబడినది. ఆత్మశక్తులు విశ్వరూప మాయాశబలిత స్వరూపులగుట వ్యత్యయముగా భావించుట అనగా ఒకటి మఱియొకటిగా దోచుట.

## స్నిగ్ధ మధుసూదన రాసావలయము ౧

ఇందు రాధా విచారమునకు గోపీమండల రాసక్రీడతోడి శ్రీకృష్ణసబంధము కారణముగా తెలియజేయ బడినది.

దేశాక్షరీరాగః - ఏకతాళః

ప॥ రాధికాకృష్ణ! రాధికా

అ॥ రాధికా! తవవిరహే కేశవ!

స్తనవినిహిత మపి హార ముదారం
సా మనుతే కృశతను రివ భారమ్ 1

సరసమసృణ మపి మలయజపంకం
పశ్యతి విష మివ వపుషి సశంకమ్ 2

శ్వసితపవన మనుపమపరిణాహం
మదనదహన మివ వహతి సదాహమ్॥ 3

దిశి దిశి కిరతి సజలకణజాలం
నయనవనళిన మివ విగళితనాళమ్॥ 4

నయనవిషయ మపి కిసలయతల్పం
కలయతి విహితహుతాశనకల్పమ్॥ 5

త్యజతి న పాణితలేన కపోలం
బాలశశిన మివ సాయ మలోలమ్॥ 6

హరి రితి హరి రితి జపతి సకామం
విరహవిహితమరణేన నికామమ్॥ 7

శ్రీజయ దేవభణిత మితి గీతం
సుఖయతు కేశవపద ముపనీతమ్ 8

కస్తూరిచే శిల్పనైపుణ్యము మెఱయ రాధ చిత్రించి ధ్యానించుచున్న శ్రీకృష్ణుని యెదుటనే వక్షస్స్థలము నందలి ముత్యాలదండలు బిగువుగానున్నట్లు చందనచర్చ కొక ప్రక్క-కొఱగు చున్నట్లు పూలుమైసోకినంతనే యుస్సురని నిట్టూర్పులు వదలుచున్నట్లు ధారగాఁ గన్నీరు విడుచు

చున్నట్లు పూలపాన్పును అగ్నిజ్వాలగాఁ జూచుచు దూర ముగానున్నట్లు సంధ్యాకాలమందలి చంద్రలేఖవలె చెక్కి-లిని చేయిజేర్చినట్లు హరిహరియని జపము చేయుచున్నట్లు విరహాకృశమైన రాధాదేవి కలామాత్ర విశిష్ట సూక్ష్మ రూపమును కనులకు పొడగట్టునట్లు చూపెను. రాధికాకృష్ణ యను సంబోధనచే ప్రకృతి పురుషుల యవినాభావ సంబంధ మును తెలియఁజేసెను.

శ్లో॥ సారోమాంచతి సీత్కరోతి విలపత్యుత్కంపతే తామ్యతి
ధ్యాయ త్యుద్భ్రమతి ప్రమీలతి, పతత్యుద్యాతి
మూర్ఛ త్యపి
ఏతావత్యతనుజ్వరే వరతనుర్జీవేన్న కిం తే రసాత్
స్వర్వైద్యప్రతిమ! ప్రసీదసియది త్యక్తోఽన్యథా
హాన్తకః॥

మన్మథావస్థలు పదింటియందు చివరది తెలియజేయ బడినది.

శ్లో॥ స్మరాతురాం దైవతవైద్యహృద్య!
త్వదంగసంగామృతమాత్రసాధ్యామ్
విముక్తబాధాం కురుషే న రాధాం
ఉపేంద్ర! వజ్రాధిక దారుణోఽసి

కృష్ణుఁడు రాధికాదేవిని జేరకున్నచో నామె ప్రాణ ములను వదలుట సత్యమని తెలియజేయఁబడినది.

శ్లో॥ కందర్పజ్వరసంజ్వరాకులతనో రాశ్చర్య మస్యా శ్చిరం
చేతశ్చందనచంద్రమఃకమలినీచింతాసు సంతామ్యతి
కింతు క్లాంతివశేన శీతలతరం త్వా మేకమేవ క్షణం
ధ్యాయంతీ రహసి స్థితా కథమపి క్షీణా క్షణం ప్రాణితి॥

రాధ శైత్యోపచారము లొనరించు చున్నను నింత వఱకు కృష్ణనామ స్మరణామృత పానముచేతనే కడబట్టిన ప్రాణములతో జీవించియుండుట తెలియఁ జేయఁబడినది.

శ్లో॥ క్షణ మపి విరహః పురా న సేహే
నయననిమీలన ఖిన్నయా యయా తే
శ్వసితి కథ మసౌ రసాలశాఖాం
చిరవిరహేణ విలోక్య పుష్పితాగ్రామ్॥

కృష్ణ సమావేశము జరుగకుండుట కంటికెదురుగా నున్న పూచిన క్రొమ్మావి రాధను మోమును త్రిప్పునట్లు చేయుటను వ్యక్తపఱచుచున్నది.

శ్లో॥ వృష్టివ్యాకులగోకులావనరసా దుద్ధృత్య గోవర్ధనం
బిభ్రద్వల్లవవల్లభాభిరధికానందా చ్చిరం చుంబితః,
దర్పే ణైవ తదర్పితాధరతటీసిందూరముద్రాంకితో
బాహుర్గోపతనో స్తనోతుభవతాం శ్రేయాంసికంసద్విషః॥

గోగోప గోపికాజనమునకు, ఇంద్రుఁడు కురిపించిన ఱాళ్ళవానపై బడకుండ గొడుగుగా గోవర్ధనపర్వతం బెత్తి

పదునాల్గు భువనముల వహించుశక్తిని ప్రకటించుచు సిందూరపుబూతచే ననురాగరసమును ప్రకటించు శ్రీకృష్ణ బాహువు శ్రేయస్సు లొసంగుఁగాత మని మంగళాచార మును ప్రకటించెను.

శ్లో॥ అహ మిహ నివసామి, యాహి రాధాం
అనునయ మద్వచనేన చానయేథాః
ఇతి మధురిపుణా సఖీ నియుక్తా
స్వయమిద మేత్య పునర్జగాద రాధామ్॥

శ్రీకృష్ణుఁడు తన సమైక్యముకై రాధ పడుచున్న దశావస్థల వివరము తెలిసికొని తిరిగి తన సమవిరహావస్థ సఖీముఖమునఁ దెలియఁజేయఁ బడినది.

## సాకాంక్షపుండరీకాక్షము

దీనివలన సఖీముఖమున రాధ తన యెడఁగల గాఢాను రాగముచే విరహావస్థలఁ గృశించి కలామాత్ర విశిష్ట యగుటకు శ్రీకృష్ణుఁడు కరగి సమరసానుభవమునకై కోరిక కలవాఁడగుట తెలియఁజేయఁబడినది,

౧౦ పంతువరాళి (దేశాక్షరీ) రాగః - రూపకతాళః

ప॥ తవవిరహే వనమాలీ॥ అ॥ సఖి! సీదతి రాధే!

వహతి మలయసమీరే మదన ముపనిధాయ
స్ఫుటతి కుసుమనికరే విరహిహృదయదళనాయ॥ 1

దహతి శిశిరమయూఖే మరణ మనుకరోతి
పతతి మదనవిశిఖే విలపతి వికలతరోఽతి॥ 2

ధ్వనతి మధుపసమూహే శ్రవణ మపి దధాతి
మనసి కలితవిరహే నిశి నిశి రుజ ముపయాతి॥ 3

వసతి విపినవితానే త్యజతి లలితధామ
లుఠతి ధరణిశయనే బహువిలపతి తవనామ॥ 4

రణతి పికసమవాయే ప్రతిదిశ మనుయాతి
హసతి మనుజనిచయే విరహ మపలపతి నేతి॥ 5

స్ఫురతి కలరవరావే స్మరతి మణిత మేవ
తవరతిసుఖవిభవే గణయతి సుగుణ మతీవ॥ 6

త్వదభిదశుభదమాసం వదతినరి శృణోతి
తమపి జపతి సరసం యువతిషు న రతి ముపైతి॥ 7

భణతి కవిజయదేవే విరహవిలసితేన
మనసి రభసవిభవే హరి రుదయతు సుకృతేన॥ 8

చంద్రుఁడు వెన్నెలచే దక్షిణానిలుఁడు మైసోఁకుచే కుసుమములు పరిమళముచే మనసు చెదర బాధించుచున్నట్లు తుమ్మెదల ఝుంకారములకు చెవి మూసికొనుచున్నట్లు 'అలతను' శరీరముచేఁ దెలియజేయుచున్నట్లు సుందరమగు నిజస్థానమును వదలి యరణ్యములఁ దిరుగుచున్నట్లు గండు కోయిలల కుహూకారములకు నలుదిక్కులకు పరుగులెత్తు చున్నట్లు; తన్ను జూచి యిదియేమి యని నవ్వువారలకు విరహావస్థ నన్యాపదేశమునఁ గప్పిపుచ్చు చున్నట్లు పావు రాళ్ళ గుబగుబధ్వనులకు అఖండమగు రాధా సమరసైక్య మనుభవించు చున్నట్లు మాసాపదేశముచే రాధాస్మృతిగల్గి తన్నామ ముద్వ్యక్షరి మంత్రముగా జపించుచున్నట్లు గోపీ మండలమున వైముఖ్యము ప్రకటించుచున్నట్లు విరహాక్రా శుఁడయిన శ్రీకృష్ణుని దివ్యమంగళమూర్తిని తీర్చి దిద్దినాడు.

శ్లో॥ పూర్వం యత్ర సమం త్వయా రతిపతే రాసాదితా స్సిద్ధయః
తస్మి న్నేవ నికుంజమన్మథమహాతీర్థే పున ర్మాధవః
ధ్యాయం స్త్వామనిశంజపన్న పితవైవాలాపమంత్రావలీం
భూయ స్త్వత్కుచకుంభనిర్భరపరీరంభామృతంవాంఛతి॥

శ్రీరాధాకృష్ణుల యపూర్వ పూర్వాన్యోన్య రసాను భూతి స్మృతిప్రకృతమందు ప్రకటింపబడిన యొండురుల ధ్యానావలోకనము ప్రకటింపఁ బడినది,

## సాకాంక్ష పుండరీకాక్షోత్కంఠా మధురము

దీనివలన సమవిరహాకృశతనుఁడగు శ్రీకృష్ణ భగవానుడు యమునాతటమున బృందావనమున పొదరింటి యందు రాధాదేవి సమాగమము ప్రతీక్షించుచున్నట్లు తెలియఁజేయఁబడినది.

ఘూర్జరీ రాగః – ఏక తాళః

ప॥ ధీరసమీరే యమునాతీరే వసతి వనే వనమాలీ॥

ఆ॥ గోపీపీనపయోధరమర్దనచంచలకరయుగశాలీ॥

రతిసుఖసారే గత మభిసారే మదన మనోహర వేశం
నకురు నితంబిని గమనవిళంబన మనుసర తం హృదయేశమ్॥ 1

నామసమేతం కృతసంకేతం వాదయతే మృదు వేణుం
బహుమనుతే తనుతే తనుసంగతపవనచలిత మపి రేణుమ్॥ 2

పతిత పత్రే విచలతి పత్రే శంసితభవదుపయానం
రచయతి శయనం సచకితనయనం పశ్యతి తవపంథానమ్॥ 3

ముఖర మధీరం త్యజ మంజీరం రిపు మివ కేళిషు లోలం
చల సఖి కుంజం సతిమిరపుంజం శీలయ నీలనిచోళమ్॥ 4

ఉరసి మురారే రుపహితహారే ఘన ఇవ తరళబలాకే
తటి దివ పీతే రతివిపరీతే రాజసి సుకృతవిపాకే॥ 5

విగళితవసనం పరిహృతరసనం ఘటయ జఘన మపిధానం
కిసలయశయనే పంకజనయనే నిధి మివ హర్ష నిదానమ్॥ 6

హరి రభిమానీ రజని రిదానీ మియ మపి యాతి విరామం
కురు మమవచనం సత్వరరచనం పూరయమధురిపు కామమ్॥7
శ్రీజయ దేవే కృతహరి సేవే భణతి పరమరమణీయం
ప్రముదితహృదయం హరిమతిసదయం నమతసుకృత
కమనీయమ్॥ 8

సంకేతస్థలమున మురళి మ్రోయించు చున్నట్లు రాధా శరీరమునోకి తనమేనసోకు పవనవశ పరాగ రేణువును బహూకరించుచున్నట్లు సరసనున్న చెట్లయాకులు కదలినను రాధ కదలి తనకడకు వచ్చుచున్నట్లు తొట్రుపాటుతోఁ గూడిన చూపుతో పాన్పునుకూర్చుచు రాధవచ్చు మార్గమును చూచుచున్నట్లు వక్షస్థలమున హారములు కదలుచున్నట్లు మ్రోగుచున్న చిఱుగజ్జల కాలియందియలను వదలి నల్లని చీరెనుదాల్చి యభిసారికా లక్షణమున శ్రీకృష్ణుని సమీపమునుజేరి తొలుకారుమబ్బున మెఱుపుఁ దీఁగెవలె మెఱసి యనిర్వచనీయసుఖ మనుభవింప బయలుదేరు రాధాదేవి దివ్యమంగళమూర్తిని సాక్షాత్కరింప జేసినాడు.

శ్లో॥ వికిరతి ముహుః శ్వాసా న్దిశః పురో ముహు రీక్షతే
ప్రవిశతి ముహుఃకుంజంగుంజన్ ముహుర్బహు తామ్యతి
రచయతి ముహు శ్శయ్యాం పర్యాకులం ముహు రీక్షతే
మదనకదనక్లాంతః కాంతే! ప్రియ స్తవ వర్తతే॥

శ్రీకృష్ణుని రాధాఽఽగమన నిరీక్షణము మనోవ్యక్తుల వివిధకల్పనలు తెలియఁ జేయఁబడినవి.

శ్లో॥ త్వద్వామ్యేనసమంసమగ్రమధునాతిగ్మాంశురస్తంగతో
గోవిందస్య మనోరథేనచసమంప్రాప్తంతమ స్సాంద్రతాం
కోకానాం కరుణస్వరేణ సదృశీ దీర్ఘా మదభ్యర్థనా
తన్ముగ్ధే! విఫలం విలంబన మసౌరమ్యోభిసారక్షణః॥

సాయంకాల సూర్యాస్తమయ ప్రకృతి వర్ణనముతో జోడించి నాయికా నాయక సఖి ప్రకృతులు రమణీయముగాఁ బ్రకటింప బడినవి.

శ్లో॥సామాంద్రక్ష్యతి వక్ష్యతిస్మరకథాః ప్రత్యంగమాలింగనైః
ప్రీతిం యాస్యతి రంస్యతేసఖి! సమాగత్యేతి చింతాకులః
స త్వాం పశ్యతి వేపతే పులకయ త్యానందతి స్వేదతి
ప్రత్యుద్గచ్ఛతి మూర్ఛతి స్థిరతమఃపుంజే నికుంజే స్థితః॥

శ్రీరాధా నాయికా సమాగమమునకై సంకేతస్థలమున శ్రీకృష్ణ నాయకుఁడు వెల్లడించు స్థాయిసాత్త్విక భావములు ముద్రింపబడినవి.

శ్లో॥ ఆశ్లేషాదనుచుంబనా దనునఖోల్లేఖా దనుస్వాంతజ
ప్రోద్బోధాదనుసంభ్రమాదనురతారంభాదనుప్రీతయోః
అన్యార్థం గతయోర్భ్రమాన్మిళితయోస్సంభాషణైర్జానతోః
దంపత్యో రిహ కో న కో తమసి ప్రీడావిమిశ్రోరసః॥

దంపతుల యన్యోన్య నవరస సుఖానుభవము అనిర్వచనీయమగుట యెఱిగింపఁ బడినది.

శ్లో॥ సభయచకితం విన్యస్యంతీం దృశౌ తిమిరే పథి
ప్రతితరు ముహు స్థిత్వా మందం పదాని వితన్వతీం
కథమపి రహః ప్రాప్తా మంగై రనంగతరంగిభిః
సుముఖి! సుభగః పశ్యన్ స త్వాముపైతు కృతార్థతామ్॥

రాధాదేవి కృష్ణసంకేతస్థల ప్రయాణ ప్రేరణము మిపుల రహింపఁజేయ బడినది.

శ్లో॥ రాధాముగ్ధముఖారవిందమధుప స్త్రైలోక్యమౌళీస్థలి
నేపథ్యోచితనీలరత్న, మవనీ భారావతారాంతకః,
స్వచ్ఛందం వ్రజసుందరీజనమనస్తోషప్రదోషోదయః
కంసధ్వంసనధూమకేతు రవతు! త్వాం దేవకీనందనః॥

శ్రీరాధా మాధవుల యవినాభావ ప్రణయరసము శ్రీకృష్ణ భగవానుని సర్వప్రపంచ సేవ్యత్వము, దుష్టసంహార లీల, గోపికలకు కృష్ణునియందైన పరమార్థజ్ఞానము దేవకీ వసుదేవుల సుకృతవిశేషము మంగళాశాసన రూపమునఁ దెలియఁజేసెను.

శ్లో॥ అథ తాం గంతు మశక్త్యా మనురక్తాం లతాగృహే
దృష్ట్వా తచ్చరితం గోవిందే మనసిజమందే సఖీ ప్రాహ॥

ఇందు నాయికా నాయకులయిన రాధామాధవుల యవస్థా సమత్వము ప్రకటింపబడినది.

# ధన్యవైకుంఠ కుంకుమము

ఈ నామముచే దర్శనమందు భాషణమందును స్పర్శమునందును అలంకారమందును రాధకృష్ణ తాదాత్మ్య మును జూపుటచే కృతార్థత్వము జెందిన కృష్ణున కలంకార మయినది.

గుణకరీరాగేణ - రూపకతాళేన గీయతే

ప॥ నాథ! హరే! జగన్నాథ! హరే!

అ॥ సీదతి రాధా వాసగృహే॥

పశ్యతి దిశిదిశి రహసి భవన్తం
త్వదధరమధరమధూనిపిబన్తమ్॥ 1

త్వదభిసరణరభసేన వలన్తీ
పతతి పదాని కియన్తి చలన్తీ॥ 2

విహిత విశదబిస కిసలయవలయా
జీవతి పర మిహ తివరతికలయా॥ 3

ముహు రవలోకితమండనలీలా
మధురిపురహ మితి భావనశీలా॥ 4

త్వరిత ముపైతి న కథమభిసారం
హరి రితి వదతి సఖీ మనువారమ్॥ 5

శ్లిష్యతి చుంబతి జలధరకల్పం
హరి రుపగత ఇతి తిమిర మనల్పమ్॥ 6

భవతి విలంబిని విగళితలజ్జా
విలపతి రోదితి వాసకసజ్జా 7
శ్రీజయ దేవకవే రిద ముదితం
రసికజనం తనుతా మతిముదితం॥ 8

కృష్ణభగవానుని దశదిశలయందు పరికించుచున్నట్లు కొన్ని యడుగులిడిపడిపోవుచున్నట్లు శైత్యోపచారమునకై తామరతూండ్లు కంకణములుగా ధరించియున్నట్లు తన యలంకారము మాటిమాటికి జూచుచు దన్ను గృష్ణునిగా భావించుచున్నట్లు కృష్ణుఁడే వచ్చుచున్నాడని నిరయవ మయిన చిమ్మచీకటిని కౌగిలించుచు ముద్దుబెట్టుచున్నట్లు చెలికత్తెతోఁ గృష్ణుఁ డింకను గడువునకు రాక యాలస్యము చేసినందులకు దుఃఖించుచున్నట్లు వాసక సజ్జికానాయికా భావమును జూపి రాధా విరహాకృశమూర్తిని దృగ్గోచర మొనరించినాడు.

శ్లో॥ విపులపులకపాళిః స్ఫీతసీత్కార మంత
ర్జనితజడిమ కాకువ్యాకులం వ్యాహరంతీ
తవ కితవ విధ త్తేఽమందకందర్పచింతాం
రసజలధినిమగ్నా ధ్యానలగ్నా మృగాక్షీ॥

సముద్రములో తల మునకలుగా మునింగినవారికి గడగడవడకు జనించుట పలుకుబడి తడబడుట సీత్కార ములు పొనర్చుట, బమ్మెరవోవుట మొదలగు వికారములు

"రసజలధినిమగ్నా" అను పదమువలన తెలియజేయ బడినది.

శ్లో॥ అంగే ష్వాభరణం కరోతి బహుశః పత్రేఽపిసంచారిణి
ప్రాప్తంత్వాంపరిశంక తేవితను తేశయ్యాంచిరంధ్యాయతి
ఇత్యాకల్పవికల్పతల్పరచనాసంకల్పలీలాశత
వ్యాఽసక్తాపివినాత్వయావరతను ర్నైషావిశాం నేష్యతి॥

దీనివలన పూర్వోక్త విషయమునే భంగిభేదముచేఁ బ్రకటించినాడు.

శ్లో॥ కిం విశ్రామ్యసి కృష్ణభోగిభవనే భాండీరభూమీరుహి
భ్రాత! ర్యాహినదృష్టిగోచరమితస్సానందనందాస్పదమ్
రాధాయా వచనంతదధ్వగముఖాన్నందాంతికేగోపతో
గోవిందస్య జయంతి సాయమతిథిప్రాశ స్త్యగర్భా గిరః॥

ఇందు కృష్ణుఁడున్న స్థానమఖండానందమునకు నెలవగుట లేనిచోటు దుఃఖాకరమగుటను తెలిసి తానాయానంద స్వరూప మనుభవించుట నన్యాపదేశముగా రాధాముఖమునఁ దెలియజేయబడినది.

శ్లో॥ అత్రాంతరే చ కులటాకులవర్త్మపాత
సంజాతపాతక ఇవ స్ఫుటలాంఛనశ్రీః,
బృందావనాంతర మదీపయ దంశుజాలైః
దిక్సుందరీవదనచందనబిందు రిందుః॥

ఉపమోత్ప్రేక్షలతో మనోహరముగా వర్ణింపఁబడిన చంద్రోదయము విరహిజనదుస్సహమగుట తెలియఁజేయఁబడినది. మఱియును జౌత్తరీయులు స్త్రీ పురుషులు మంచి గంధముతో తిలకము దిద్దుకొను దేశీయమర్యాదయును తెలియఁ జేయఁబడినది.

శ్లో॥ ప్రసరతి శశధరబింబే విహితవిలంబే చ మాధవే విధురా
విరచిత వివిధవిలాసం సా పరితాపం చకారోచ్చైః॥

రాధ తాను విరహావస్థనుండుట చంద్రదర్శనము బాధాకరమని ప్రకటించుటవలన ఇంద్రియముల నడిపించు మనస్సుధ్వనింపఁ జేయఁబడినది.

# నాగర నారాయణ రాసావలయము

రాధ చెలికత్తె తన విరహావస్థ విశదీకరింప విని సమ విరహావస్థయందున్న కృష్ణుఁడిదే వచ్చుచున్నాను. అని చేసిన సమయనిర్ణయము సఖీముఖమున మరల వినియు చెప్పినసమయమునకు కృష్ణుఁడు రాకుండుటవలన సర్వజన మనోహరుఁడగుట రాసక్రీడయందు తమకు వశుఁడగుట గోపికలు గమనమున కడ్డుతగులుట, యూహింపఁబడినది.

మాళవరాగ యతి తాళాభ్యాంగీయతే

ప॥ యామి హే! క మిహ శరణం

అ॥ సఖీవచనవంచి తాహమ్॥

కథితసమయేపి హరి రహహ నయయౌ వనం
మమ విఫల మిద మమలరూప మపి యౌవనం॥ 1

యదనుగ మనాయ నిశి గహన మపి శీలితం
తేన మమ హృదయ మిద మసమశరకీలితమ్॥ 2

మమ మరణ మేవ మతివితథ కేతనా
కి మితి విషహామి విరహానల మచేతనా॥ 3

మా మహహ! విధురయతి మధురమధుయామినీ
కాపి హరి మనుభవతి కృతసుకృత కామినీ॥ 4

అహహ! కలయామి వలయాది మణిభూషణం
హరివిరహదహనవహనేన బహుదూషణం॥ 5

కుసుమసుకుమారతను మతనుశరలీలయా
స్రగపి హృది హంతి మా మతివిషమశీలయా॥ 6

అహ మిహ హి నివసామి న విగణితవేతసా
స్మరతి మధుసూదనో మా మపి న చేతసా॥ 7

హరిచరణశరణ జయదేవకవిభారతీ
వసతు హృది యువతి రివ కోమలకలావతీ॥ 8

సఖీముఖమున పంద్రెండవ యష్టపదిలో చరాచర సర్వప్రపంచము కృష్ణ మయముగాఁ దాను చూచుట తెలియఁజేసి యిప్పుడు సర్వజన శరణ్యుడగు కృష్ణపరమాత్మకన్న శరణ్యు లెవ్వరును లేరని తెలియఁజేయుచు నున్మాదావస్థయందున్న రాధ వాక్ప్రసారము కలుగనీని మూర్ఛా మరణావస్థలు తప్పక సంభవించిన తానేమియుఁ జేయ లేకుండుట యిట్లు ప్రలాపించుచున్నది.

అర్థరాత్రమున యమునాపరిసరమున బృందారణ్యము తిరిగి తిరిగి వేసారితిని. నా నాథుఁడు జగన్నాథుఁడు కన్పింపకుండెను. ఏమి చేయుదును. ప్రాణనాథుఁడు రాకుండుట నా జీవితము అందము అంతయు వ్యర్థము. మన్మథుఁడు హృదయమును మథించుచున్నాడు. వసంతకాలరాత్రి కాళరాత్రి వలె వేధించుచున్నది. కంకణములు మొదలయిన యీ నవరత్న భూషణములు నిరర్థకములు. పుష్పములు మన్మథునకు బాణములగుట మెడలోని పూలదండయు బాధాకరముగా నున్నది. ఒకవేళ నా నాథుఁడు నాకై బయలుదేరినను రాసక్రీడయందు గారడివానివలె బహురూపములఁ జిత్రము జూపుచు బహువిధములయిన సాధనలచే సంతతానందమున నెల్లరఁజొక్కించుటను, ఆ మండలిలోనివారు రానిత్తురా. తద్వశుఁడై నవానికి నేను తలంపునకు వత్తునా నేనీ ప్రబ్బలి తీవె పొదరింట నుండఁదగదు. అని యూకొట్టు శ్రోతలు లేకయే తనలోనే తాను పలుమాఱు పలికిన పలుకులే షణ్ణ

కుట. ఉన్మాదావస్థ బాహ్యస్థితి, ( కృష్ణవాచనిక తన్మయత్వము ) రహస్యము.

శ్లో॥ తత్కిం కామపి కామినీ మభిసృతః కిం వా కలాకేళిభిః
బద్ధో బంధుభి రంధకారిణి వనాభ్యర్ణే కిముద్భ్రామ్యతి
కాంతః క్లాంతమనామనాగపిపథిప్రస్థాతుమేవాఽక్షమః
సంకేతీకృతమంజువంజులలతా కుంజేపి యన్నాగతః॥

సమ విరహావస్థతోనున్న కృష్ణుఁడు తన నమీపము నకు వచ్చుచుండ మార్గమధ్యమున సంభవించిన పలువిధములయిన నిరోధములు కలుగుట తెలియఁ జేయఁబడినది.

శ్లో॥ అథాగతాం మాధవ మన్తరేణ
సఖీ మియం వీక్ష్య విషాదమూకాం
విశంకమానా రమితం కయాపి
జనార్దనం దృష్టవ దేత దాహ॥

రాధ తానుపంపిన చెలికత్తె మిక్కిలి ప్రయత్నము జేసియు కృష్ణునివద్దకు జేర్ప లేకుండుటకు విచారపడి మౌనము వహించియుండదాను ప్రత్యక్షముగాఁజూడకున్నను, ఒకానొక గోపిక కృష్ణునితో సుఖించుట యూహించి చెప్పుట రాధకు కృష్ణునియెడఁగల యత్యంత భోగోత్కంఠ తెలియ జేయఁబడినది.

## హరిరమిత చంపక శేఖరము

ఈ నామమువలన సువాసనచే దూరమందున్నను వాయువశమున సంపంగిపూవు దగ్గఱనున్నట్లు లెట్లు తెలియఁ బడుచున్నదో యట్లే తాను దూరమందున్నను కృష్ణభావనా బలమున ననుభవబలము వలనను కృష్ణుడు తనకు కన్పించు టచే సుఖించుచున్న యనిర్దిష్టస్త్రీయును కన్పించుచుండె నను గూఢార్థము ప్రకటమగు చున్నది.

వసంతరాగయతి తాళాభ్యాంగీయతే

ప॥ కాపి మధురిపుణా

అ॥ విలసతి యువతి రత్యధికగుణా

స్మరసమరోచిత విరచితవేశా
గళితకుసుమదర విలులితకేశా ॥

హరిపరిరంభణవలితవికారా
కుచకలశోపరితరళితహారా ॥

విచలదలకలలితాననచంద్రా
తదధరపానరభసకృతతంద్రా ॥

చంచలకుండలదళితకపోలా
ముఖరితరశనజఘనగతిలోలా ॥

దయితవిలోకితలజ్జితహసితా
బహువిధకూజితరతిరసరసితా ॥

విపులపులక పృథువేపథుభంగా
శ్వసితనిమీలితవికసదనంగా ॥
శ్రమజలకణభరసుభగశరీరా
పరిపతితోరసి రతిరణధీరా ॥
శ్రీజయదేవఫణితహరిరమితం
కలికలుషం జనయతు పరిశమితమ్ ॥

నెఱులనుండి పూలురాలుచున్నట్లు వక్షస్థలమున హారములు కదలుచున్నట్లు మొగమునందు ముంగురులు క్రమ్ముకొనినట్లు సిగ్గుచేనవ్వుచున్నట్లు చెవులకొనలయందు అవలజోడు మెఱయుచున్నట్లు నడుమునందు చిఱుగజ్జెల బంగారు టొడ్డాణము మెఱయుచున్నట్లు శరీరమంతయు గగ్గురుపాటు జెందుచున్నట్లు నిట్టూర్పులు విడచుచున్నట్లు భావపలకమున కృష్ణుని సమక్షమున నొక గోపికను చిత్రించినాడు.

శ్లో॥ విరహపాణ్డుమురారిముఖాంబుజ
ద్యుతి రయం తిరయ న్నపి వేదనామ్,
విధురతీవ తనోతి మనోభవః
సుహృదయే హృదయే మదనవ్యథామ్ ॥

మనోభవత్వము తోడయి యుండుట చంద్రుఁడు విరహదశయందు బాధించుట తెలియఁ జేయఁబడినది.

# హరిరస మన్మథ తిలకము

ఈ నామమునందు సర్వహృదయంబుల నాకర్షించు శృంగార రసానుభూతిని రాధా ముఖాదులయందు తిలకాదు లగు నలంకారరచనల వలన శ్రీకృష్ణుడు, నాయక శిరోమణి యని తెలియఁ జేయఁబడినది.

౹౸ ఘూర్జరీరాగైకతాళాభ్యాంగీయతే

ప॥ విజయీ మురారి రధునా

అ॥ రమతే యమునాపులినవనే ॥

సముదితమదనే రమణీవదనే చుంబనవలితాధరే
మృగమదతిలకం లిఖతి సపులకం మృగమివ రజనికరే॥

ఘనచయరుచిరే రచయతి చికురే తరళితతరుణాననే
కురువకకుసుమం చపలాసుషమం రతిపతిమృగకాననే
ఘటయతి సుఘనే కుచయుగగగనే మృగమదరుచిరూషితే
మణిసర మమలం తారకపటలం నఖపదశశిభూషితే॥

జితబిసశకలే మృదుభుజయుగళే కరతలనళినీదళే
మరకతవలయం మధుకరనిచయం వితరతి హిమశీతలే॥

రతిగృహజఘనే విపులాపఘనే మనసిజకనకాసనే
మణిమయరశనం తోరణహసనం వికిరతి కృతవాసనే॥

చరణకిసలయే కమలానిలయే నఖమణిగణపూజితే
బహిరపవరణం యావకభరణం జనయతి హృదిరోజితే॥

రమయతి సుదృశం కామపి సుభృశం ఖలహలధరసోదరే
కిమఫల మవసం చిర మిహ విరసం వద సఖి! విటపోదరే॥

ఇహరసభణనే కృతహరిగణనే మధురిపుపదసేవకే
కలియుగచరితం న వసతు దురితం కవిన్నప జయదేవకే॥

యమునానది యిసుకతిన్నెపై చంద్రమండలమందలి లేడిగా నొక గోపీ ముఖమండలమున కృష్ణునిచే కస్తూరీ తిలకము లిఖింపఁబడినది. చంద్రమండలమును క్రమ్మిన మేఘమండలములను వెనుకకుదువ్వి ముఖవిశాలత్వము ప్రకటింపఁబడినది. ఆ మేఘమండల మందలి మెఱపుదీగె వలె ముంగురులయందు గోరింటపూవు తుఱుమఁబడినది. ఆకాశామునందు నక్షత్రపంక్తుల రీతిని పాలిండ్లపై రత్నహారము లలంకరింపఁ బడినవి. మృదువైన బాహువులయందు చిగురుటాకులగేరు ముంజేతులయందు తుమ్మెదలవంటి గరుడపచ్చల సొమ్ములలవరింపఁబడినవి. మన్మథుని బంగారు గద్దియయగు జఘనమందు తోరణవలె రతనాలయెడ్డాణ మలంకరింపఁబడెను. లక్ష్మీస్థానమయిన పాదపద్మముల యందు లత్తుకరసముపూసి హృదయములోని యనురాగము ప్రకటింపఁబడినది. తన్నుహత్తుకొనిన నన్నువదలి హలధరుని తమ్ముడు విరసుఁడునై నా నాయకుఁడెవతుకనో పైరీతి నలంకరించుచున్నాడు. సఖి! యీ పొదరింటిలో నెంతసేపు నిరీక్షించిన నేమిఫలమని రాధ విచారనిమగ్నయగుట ప్రకటిత మగుచున్నది.

ఒక గోపికకు కృష్ణుఁడు ముఖమందు తిలకము దిద్దుచున్నట్లు ముంగురులు పైకొత్తి. వెనుక భాగమున క్రొమ్ముడి వేయుచున్నట్లు వక్షస్స్థలమున రత్నాలహారము లలంకరించు చున్నట్లు బుజములందు ముంజేతులందు గరుడ పచ్చలసొమ్ము లమరించుచున్నట్లు నడుమున రత్నాల మొలనూలు హత్తుచున్నట్లు పాదములయందు లత్తుకరసము పూయుచున్నట్లు జయదేవుఁడు చిత్రమగు వాఙ్మయ శిల్పమున జిత్రించినాడు.

శ్లో॥ నాయాత స్సఖి! నిర్దయో యది శఠ స్త్వం దూతి! కిం దూయసే ?
స్వచ్ఛందంబహువల్లభ స్సరమతే కిం తత్ర తే దూషణం
పశ్యాద్య ప్రియసంగమాయ దయిత స్యాకృష్య మాణం గుణై
రుత్కంఠార్తి భరాదివ స్ఫుటదిదం చేతస్స్వయం యాస్యతి॥

దీనియందు కృష్ణునియందు దక్షిణ నాయకత్వము దానికి విరుద్ధంబగు శఠత్వము ప్రకటింపఁబడినది.

# నారాయణ మదనాయాసము

జీవసమూహమందు స్థానమని జలమందు స్థానమని నారాయణ శబ్దమున కర్థము. ఈ యర్థమును తెలిసి నేనే నారాయణుఁడు ననుకొను శ్రీకృష్ణుని నిత్యానందానుభూతి వలన నిరాయాసము ప్రకటింపఁబడినది.

దేశవరాళి రాగరూపక తాళాభ్యాంగీయతే

ప॥ సఖి! యా రమితా వనమాలినా

అ॥ సఖి! యా రమితా వనమాలినా

అనిలతరళ కువలయనయనేన
తపతినసా కిసలయశయనేన
వికసితసరసిజ లలితముఖేన
స్ఫుటతి న సా మనసిజవిశిఖేన ॥
అమృతమధురమృదుతరవచనేన
జ్వలతి న సా మలయజపవనేన ॥
స్థలజలరుహరుచికరచరణేన
లుఠతి న సా హిమకరకిరణేన ॥
సజలజలదసముదయరుచిరేణ ॥
దళతినసాహృది విరహభరేణ
కనకనిభరుచిశుచివసనేన
శ్వసితి న సా పరిజనహాసనేన

సకలభువనజనవరతరుణేన
వహతి న సా రుజ మతికరుణేన ॥
శ్రీజయదేవ ఫణితవచనేన
ప్రవిశతు హరిరపి హృదయ మనేన ॥

పరిమళ మిళితములగు తులసి పూలదండలచే విలసిల్లు శ్రీకృష్ణ జగన్నాయకుని రమించినయువతి విప్పారిన కలువరేకులవంటి వెడఁదకన్నులు గలవాడగుటను చిగురుటాకు పాన్పునందు తపించుట జరుగదు. వికసించిన తామర పూవువలె నందమైన నెమ్మోము కలవాడగుట మన్మథ బాణముచే నెన్నడును కొట్టఁబడదు. అమృతరసమువలెను తియ్యనై మెత్తనయిన పలుకుబడి కలవాఁడగుట మలయ పర్వతమునుండివచ్చు పయ్యెరయు మంటలెగయఁజేయఁ జాలదు. మెట్టతామర పూవువంటి కరచరణములు కలవాడగుట చంద్రకిరణ స్పర్శచే నేలయందు పొరలదు. నీరునిండిన మేఘమండలమువలె నిగనిగమను శరీరచ్ఛాయ కలవాడగుట హృదయము విదారింపబడదు. ఒఱగల్లుపై గీటించిన బంగారువలెను ప్రకాశించు పట్టుపుట్టము కలవాడగుటను చెలికత్తియల నవ్వులాటచే నిట్టూర్పు విడువదు. సుప్రసిద్ధిఁ జెందిన బలము సౌందర్యము కలవాఁడగుట జాలిగలుగ జేయు బాధలు తలసూపవు.

విశాలనేత్రములు మెట్టతామర పూలవంటి కరచరణములు కలిగి పట్టు పుట్టముధరించి నీలమేఘచ్ఛాయగల

శరీరముతో పెదవికదలించి మాట్లాడుచున్నట్లు మెడనిండ తులసిపూదండలుగల శ్రీకృష్ణ భగవానుని చిత్రించినాడు.

శ్లో॥ మనోభవానందన! చందనానిల!
ప్రసీద రేదక్షిణ! ముంచ వామతాం,
క్షణం జగత్ప్రాణ! నిధాయ మాధవం
పురో మమ ప్రాణహరో భవిష్యసి ॥

శ్లో॥ రిపు రివ సఖీసంవాసోయం శిఖీవ హిమానిలో
విష మివ సుధారశ్మి ర్యస్మిన్ దునోతి మనోగతే
హృదయ మదయే! తస్మిన్నేవం పున ర్వలతే బలాత్
కువలయదృశాం వామః కామో నిరంకుశః ॥

శ్లో॥ బాధాం విధేహి మలయానిల! పంచబాణ!
ప్రాణాన్ గృహాణ, న, గృహం పున రాశ్రయిష్యే
కిం తే కృతాంతభగిని! క్షమయా తరంగై
రంగానిసించ మమ శామ్యతు దేహదాహః ॥

మనోభవాది శ్లోకత్రయమందు నాయికా నాయకు లొక్కచో నున్నప్పుడు మలయమారుతము చంద్రుఁడు చెలులసన్నిధి నదులును సుఖప్రదము లగుట యెడబాటు నందు కష్టహేతువులగుటయును పేర్కొఁబడినది.

శ్లో॥ ప్రాత ర్నీలనిచోళ మచ్యుత మురః స్సంవీతపీతాంబరం
రాధాయా శ్చకితం విలోక్య హసతి స్వైరం సఖీమండలే
క్రీడాచంచల మంచలం నయనయో రాధాయ రాధాననే
స్వాదు స్మేర ముఖోఽయ మస్తు జగ దానందాయ
నందాత్మజః॥

దీనియందు రాధాకృష్ణుల యన్యోన్య సంయోగతా దాత్మ్యము పీతాంబర నీలాంబరముల మార్పువలనఁ దెలియఁ జేయఁబడినది.

శ్లో॥ కథ మపి యామినీం వినీయ
స్మరశరజర్జరితాఽపి సా ప్రభాతే,
అనునయవచనం వదంత మగ్రే
ప్రణత మపి ప్రియ మాహ సాభ్యసూయమ్॥

దీనియందు శ్రీకృష్ణుని దక్షిణనాయకత్వము రాధావశంవదత్వము తెలియఁ జేయఁబడినది.

# లక్ష్మీ పతి తారావళి

దీనివలన సమస్తలోకములు శ్రీకృష్ణ సూత్రమున ముత్యాలవలె కూర్పఁబడి యుండుట తెలియఁజేయఁబడినది.

భైరవిరాగయతి తాళాభ్యాంగీయతే

ప॥ యహి మాధవ! యాహి కేశవ! మావదకైతవవాదం
అ॥ తా మనుసరసరసీరుహాలోచన! యాతవహరతివిషాదమ్॥

రజనిజనితగురుజాగరరాగక, షాయిత మలసనిమేషం
వహతి నయనమనురాగమివ స్ఫుటముదితరసాభినివేశమ్

కజ్జలమలిన విలోచనచుంబన విరచితనీలి మరూపం
దశనపసన మరుణం తవ కృష్ణ! తనోతి తనో రనురూపమ్

వపురనుసరతి తవ స్మరసంగర ఖరనఖరక్షతరేఖం
మరకతశకలకలితకలధౌతలిపేరివ రతిజయలేఖం॥

చరణకమలగళదలక్తసిక్త మిదం తవహృదయ ముదారం
దర్శయతీవ బహిర్మదనద్రుమనవకిసలయపరివారమ్॥

దశనపదం భవదధరగతం మమ జనయతి చేతసి ఖేదం
కథయతి కథ మధునాపి మయాసహ తవవపు రేత దభేదమ్

బహిరివ మలినతరం తవ కృష్ణ! మనోపి భవిష్యతి నూనం
కథమథ వంచయసే జన మనుగత మసమశరజ్వరదూనమ్

భ్రమతి భవానబలాకబలాయ వనేషు కి మంత్ర విచిత్రం
ప్రథయతి పూతనికైవ నధూవధనిర్దయబాలచరిత్రమ్
శ్రీజయదేవభణితరతివంచిత ఖండితయువతివిలాపం
శ్రుణుత సుధామధురం విబుధా! విబుధాలయయతోఽపి
దురాపమ్

ఇందు అందగాడు సిరికలవాడు అన్యస్త్రీ సంగతుం డౌటను కేశవ సరసీరుహ శబ్దముల సంబోధనల వలనం దెలియంజేయుచు రాధయొక్క ఖండిత నాయికత్వము ప్రకటింప బడినది. రాత్రియంతయు మేల్కొనియుండుట కన్ను లెఱ్ఱవడి లోపలంగల యనురాగము గనులనుండి శృంగార రసముపైకి పొంగివచ్చినట్లున్నది. స్త్రీకన్నుల కాటుక యంటి శరీరచ్ఛాయవలెను కెంపురీతి సహజరక్తిమకల కెమ్మోవి నల్లనైనది మంచిగంధపుపూంతచే తెల్లనిచారలు కల నీనల్లని దేహమునందు గరుడుపచ్చల పలకయందు లిఖించిన శృంగార జయప్రతి కాక్షర రేఖలవలె గోరువంకల్లు నఖక్షతములు ప్రస్ఫుటములగు చున్నవి. ఇతర స్త్రీ కాలి లత్తుకరసమంటిన వక్షస్థలములో నున్న కామవృక్షము చిగుళ్ళుపైకి తలచూపినట్లు లెఱ్ఱనైయున్నది. కెమ్మోవి యందు పలునొక్కులు దంతక్షతములు కన్పించుచుండ నీమేను నామేను వేఱుకాదొక్కటియే యనుట యెట్లు కుదురును. కృష్ణశబ్దమునకు తగినట్లు శరీరము వలెనే నీమనస్సును నల్లనైనది అనన్యశరణ్యయై తపించుచున్నది నన్ను వంచించి తపింపజేయుచు

యెట్లని ఖండితముగా ఖండితానాయికత్వము ప్రకటమగు చున్నది.

శ్లో॥ త వేదం పశ్యంత్యాః ప్రసర దనురాగం బహిరివ
ప్రియాపాదాల క్త చ్ఛురిత మరుణ చ్ఛాయహృదయం
మ మాద్యప్రఖ్యాత ప్రణయభర భంగేన కితవ!
త్వదాలోకశ్శో కా దపి కి మపి లజ్జాం జనయతి॥

అను శ్లోకమునను ఖండితాత్వమే బలపఱుపబడినది.

శ్లో॥ అంతర్మోహనమౌళిఘూర్ణనచల న్మందారవిభ్రంశన
స్తంభాకర్షణదృష్టిహర్షణమహామంత్రః కురంగీదృశాం
దృప్యద్దానవదూయమాన దివిషద్దుర్వారదుఃఖాపదాం
భ్రంశః కంసరిపో స్సమర్పయతు వ శ్శ్రేయాంసివంశీరవః॥

ఇందు సరసశృంగార చేష్టలచే నెల్ల గోపికల నాకర్షింపఁజాలి రాక్షస సంహారమున వీరరస స్వరూపమును శ్రీ వేణుగోపాలుని గానము దేవతల కానందాపాదకము శాంతస్వరూపము నగునది ప్రణవమని మంగళాచారముగా రచింపఁబడినది.

శ్లో॥ తా మథ మన్మథఖిన్నాం
రతిరసభిన్నాం విషాదసంపన్నాం
అనుచుంబిత హరిచరితాం
కలహాంతరితా ముఖాచ రహాసి సఖీ॥

అను శ్లోకమున ఎడబాటుచేత తపించుచు శ్రీకృష్ణు సాంగత్యము లభింపకుండుటకు వగచుచు నితర విషయాసక్తి మఱింత దుఃఖహేతువని హరిచరిత్రామృత పానముచేయు రాధను చెలికత్తియ కలహాంతరితగా నెఱుంగుట తెలియఁ జేయబడినది.

## 18 అమందముకుందము

ఘూర్జరీరాగయతి తాళాభ్యాంగీయతే

ప॥ మాధవే! ॥

అ॥ మాకురు మానిని మానమయే!

హరి రభిసరతి వహతి మధుపవనే
కి మపర మధిక సుఖం సఖి! భవనే॥

తాళఫలాదపి గురు మతిసరసం
కిము విఫలీకురుషే కుచకలశమ్॥

కతి న కథిత మిద మనుపదరుచిరం
మా పరిహర హరి మతిశయరుచిరం॥

కి మితి విషీదసి రోదిషి వికలా
విహసతి యువతిసభా తవ సకలా॥

మృదునళినీదళశీతలశయనే
హరి మవలోకయ! సఫలయ నయనే॥

జనయసి మనసి కి మితి గురుఖేదం
శ్రుణు! మమవచన మనీహిత ఖేదమ్॥
హరి రుపయాతు వదతు బహుమధురం
కి మితి కరోషి హృదయ మతివిధురమ్॥
శ్రీజయ దేవ ఫణిత మతిలలితం
సుఖయతు రసికజనం హరిచరితమ్॥

దీనివలన స్థూల సూక్ష్మ కారణములను మూడు శరీరములయందు జాగ్రత్త, స్వప్నము. సుషుప్తి యను మూడవస్థలయందు శ్రీకృష్ణుఁడు జాగరూకుఁడైన సుందరుఁడని ప్రకటమగు చున్నది.

ప్రియతముండగు శ్రీకృష్ణుఁడు నీహృదయము మెఱిఁగి నీకు హాయిగొలుప బయలు దేరి వచ్చుచున్నాడు. తప్పక రాఁగలఁడని యింతకు మున్ను గూడ మాటిమాటికి చెప్పియుంటిని. యౌవనమును వృద్ధిఁజేయఁదగిన యవయవములు కృశింప గుర్తించుటకుగూడ వీలుకానియట్లు దుఃఖించుట తగదు నీయందమునకు తగినయందగాడు శ్రీకృష్ణుఁడు వచ్చుచున్నాడు. [illegible] బాష్పనఁజేరి నీహృన్నాథుని నిరీక్షించుచుందువు. నీ సహచరునకు నీకు వేఱెవ్వఁడును లేదు. అచిరకాలములోనే హృదయానందము సందానింపగలఁడు. అనుమానమను కార్చిచ్చును శమింపఁజేయుము. అని రాధానాయికఁగూర్చి [illegible] త్రియ యోదార్ప చిత్రింపఁబడినది.

శ్లో॥ స్నిగ్ధే యత్పరుషాసి యత్ప్రణమతి స్తబ్ధాసి యద్రాగిణి
ద్వేషస్థాసియదున్ముఖే విముఖతాం యాతాసి తస్మిన్ ప్రియే
తద్యుక్తం విపరీతకారిణి! తవ శ్రీఖండ చర్చా విషం
శీతాంశు స్తపనో హిమంహుతవహః క్రీడాముదో యాతనాః

స్నిగ్ధే యత్పరుషాసి అను శ్లోకమున ఇంతకుమున్ను ప్రియుండు గాఢానురాగముగలిగి యెంత వినయముజూపినను బ్రతిమాలుకొన్నను నీవు వైపరీత్యముగా కఠినత్వముజూపుటచే నీకిప్పుడిట్టి విరహబాధ సంభవించినదని చెలికత్తెచే రాధకు తెలియఁ జేయఁబడినది.

శ్లో॥ సాంద్రానందపురందరాదిదివిష ద్బృందై రమందాదరా
దానమ్రై ర్మకుటేంద్రనీలమణిభి స్సందర్శి తేదిందిరం
స్వచ్ఛందం మకరందసుందరమిళ న్మందాకినీ మేదురం
శ్రీగోవిందపదారవింద మశుభ స్కందాయవందామహే॥

దీనియందు శ్రీకృష్ణ భగవానుని పాదారవిందము. ఇంద్రాది దేవతలచే నిత్యము సేవింపఁబడుటయు గంగ జన్మించుటకు కారణమగుటయును తెలియఁ జేయఁబడినది.

శ్లో॥ అత్రాంతరే మసృణరోషవశా దసీమ
నిశ్వాసనిస్సహాముఖీం సుముఖీ ముపేత్య.
సవ్రీడ మీక్షితసఖీవదనాం దినాంతే
సానందగద్గదపదం హరి రిత్యువాచ ॥

దీనియందు సర్వకాలము తనవద్దనే యుండకుండుటకు సిగ్గుచే చెలికత్తెనుచూచుచు నిట్టూర్పును విడుచుచున్న రాధనుజేరి సర్వాపరాధహరుఁడగు శ్రీకృష్ణుఁడు ప్రాకృత నాయకునివలె దగ్గరజేరి మాటతడబడ ప్రార్థించుట తెలియఁజేయఁబడినది.

చతురచతుర్భుజ రాగరాజి చంద్రదర్యోతము ఇందు పదునాల్గుజగంబుల సృజింపఁ బెంపద్రుంపను సమర్థుఁడగుట పండువెన్నెలగాయు పున్నమనాటి నిండుచందమామవలెను ప్రేమ స్వరూపము శ్రీకృష్ణుఁ డేయని ప్రస్ఫుటముగా బోధింపఁబడినది.

## మూల వృత్తాంతము

వింధ్య దేశ ప్రభుసంస్థానమున జయదేవుఁడున్న సమయమున సహగమనమనఁగా భర్తతోఁగూడ ప్రాణములు వదలుటయేయని పద్మావతి పట్టపు దేవికి బోధించుచో నామెను పరీక్షింపనెంచి రాజువెంట విలాసార్థము వేటకుజనుట తెలిసి యాకస్మికముగా జయదేవుఁడు మెకము నోటఁబడెనని పట్టపుదేవికిం వదంతి పుట్టించి పద్మావతికి చెవినోకునట్లుచేసెను. పద్మావతి వెంటనేచెప్పినట్లు ప్రాణములను వదలెను. ఇలుసేరిన పద్మావతీభర్త తెలిసి తన సతి యీలోకమువీడి పోవుటను తెలిసి లక్ష్మీనారాయణాంశుఁడు నిదురించుచున్నదానిని లేపినట్లు. ఈ యష్టపదీ

గేయమును. కరుణరససూచకమగు "ముఖారి" రాగములో దేవగానమొనర్చెను. వెంటనే లేచి తక్కిన యష్టపదులు దశావతారాదులకు భర్త దివ్యగానమునకు సరిగా దివ్య నృత్య మొనరించెను.

ముఖారి—దేశవరాళిరాగ ఝుంపాతాళాభ్యాంగీయతే

ప॥ ప్రియేచారుశీలేముంచమయిమానమనిదానం

అ॥ సవదిమదనా నలోదహతి మమమానసం
దేహి ముఖకమల మధుపానమ్॥

వదసియదికించిదపిదంతరుచికౌముదీహరతిదరతిమిర
మతిఘోరం

స్ఫురదధరశీధవేతవవదన చంద్రమారోచయతులోచన
చకోరమ్॥

సత్యమేవాసియ దిసుదతి! మయికోపిసీ దేహిఖరనఖరశరజాతం
ఘటయభుజబంధనంజనయరదఖండనంయేనవాభవతి
సుఖజాతమ్

త్వమసి మమ భూషణం త్వమసి మమ జీవనంత్వమసి మమ
భవజలధిరత్నం

భవతు భవతీహమయి సతతమనురోధిసీతత్రమమహృదయ
మతియత్నమ్॥

నీలనలినాభ మపి తన్వి! తవలోచనం ధారయతి కోకనద
రూపం
కుసుమశరబాణభావేన యదిరంజయసి కృష్ణమిదమేతదను
రూపమ్॥

స్ఫురతు కుచకుంభయో రుపరి మణిమంజరీ రంజయతు తవ
హృదయదేశం
రసతురశనాపితవఘనజఘన మండలే ఘోషయతు
మన్మథనిదేశమ్

స్థలకమలగంజనం మమహృదయరంజనం జనితరతిరంగ
పరభాగం
భణ! మసృణవాణి! కరవాణిచరణద్వయం సరససదలక్తక
సరాగమ్॥

స్మరగరళఖండనం మమశిరసిమండనం దేహి పదపల్లవ
ముదారం
జ్వలతి మయి దారుణోమదనకదనానలో హరతుతదు
పాహితవికారమ్॥

ఇతి చటులచాటుపటుచారుమురవైరిణోరాధికా మధి
వచనజాతం
జయతి జయదేవకవి భారతీభూషితంమానినీ జనజనితశాతమ్॥

నాకు సర్వదా సర్వవిధములను ప్రియమొనర్చు
దానవు. మంచినడవడి గలదానవు. ఎన్నండును నన్నెడఁ

బాయనిదానవు. ఇపుడేలనో మార్గమున నున్న దానవు నన్ను సాధింపవలయునను పట్టుదలను వీడుము. నీముఖ పద్మములోని యమృతమును గ్రోలనున్న నాసంతాపాగ్ని ని చల్లార్చుము ( సహస్రారములోని యవిచ్ఛిన్నామృతము ) పల్లెత్తి మాట్లాడకున్న నాలోజీకటి యెట్లుశమించును, బాహ్యాధర పానమున కన్నులను వెన్నెలపిట్టలను నీ ముఖ చంద్రుఁడు ప్రకాశింపఁజేయుగాక నాయెడ నీకు కోపము కలిగిన తగినశిక్ష నొనర్చుము నాసర్వము నాబ్రతుకు నీవే నా సంసారమును ( జగత్కుటుంబము ) ప్రకాశింపఁజేయు రత్నమవు నీ యానుకూల్యము లేకున్న నేనిల్చుట యసంభ వము కావున ప్రయత్న పూర్వకముగా నన్నను సరింప వలయును నల్లకల్వను పోల్పఁదగిన నీ కాటుక కన్నును కోపకారణముచే నెఱ్ఱకల్వఁగాఁ జేయుకుము. మన్మథ బాణముగా నాయందుపయోగించిన మిక్కిలి సంతసింతును పాలిండ్లపై చిక్కుపడియున్న హారముల సవరించుకొనుము. జాఱిన బంగరు చిఱుగజ్జెల మొలనూలును మ్రోయింపుము. రసవంతములగుట మెట్టతామరల తిరస్కరించు నీ మృదు పదముల నాకందింపుము. అనురాగ వంతములవ నొనరింతును పల్లవములవలె మృదువులగు నీ పదముల శిరసావహింతును. ( అట్లొనర్చిన విషమవిషయ విషరసమువిఱిగి యాకలి దప్పి కలు లేని పరమానంద సుఖానుభూతి మనకిర్వురకు సిద్ధము.

(అని రహస్యము)

శ్లో॥ పరిహార కృతాతంకే శంకాం త్వయా సతతం ఘన
స్తనజఘన యాక్రాంతే స్వాంతే పరా నవకాశిని
విశతి వితనో దన్యో ధన్యో న కోపి మ మాంతరం
ప్రణయిని! పరీరంభారంభే విధేహి విధేయతాం॥

శ్లో॥ ముగ్ధే! విధేహి మయి నిర్దయదంతదంశం
దోర్వల్లి బంధనిబిడ స్తనపీడనాని
చండి! త్వ మేవ ముద ముద్వహ పంచబాణ
చండాలకాండదళనా దసవః ప్రయాంతి॥

శ్లో॥ శశిముఖి! తవ భాతి భంగురభ్రూః
యువజన మోహకరాలకాలసర్పి
త దుదితవిషభంజనాయ యూనాం
త్వ దధరశీధుసుధైవ సిద్ధమంత్రః॥

శ్లో॥ వ్యథయతి వృథా మౌనం తన్వి! ప్రపంచయ! పంచమం
తరుణి! మధురాలాపై స్తాపం వినోదయ దృష్టిభిః
సుముఖి! విముఖీభావం తావ ద్విముంచ!న ముంచ!మాం
స్వయ మతిస్నిగ్ధో ముగ్ధే! ప్రి యోఽయ ముపస్థితః॥

ఈ నాల్గు శ్లోకములలోను (ప్రియే! చారుశీలే) అను పందొమ్మిదవ యష్టపదిలోని భావమే స్ఫురించు చున్నది. ప్రకతి పురుషులు విశ్వరూపమున నున్నప్పుడు స్త్రీ పురుషులుగా రెంటిలక్షణములను కన్పించి యొకప్పు

డెడబాటు ఒకప్పుడైక్యము సహజముగా జీవులకుమాత్రము గోచరించును.

శ్లో॥ బంధూకద్యుతిబాంధవోయ మధరఃస్నిగ్ధోమధూకచ్ఛవిః
చండశ్చండి! చకాస్తి నీలనళినీ శ్రీమోచనం లోచనం
నాసా త్యేతి తిలప్రసూనపదవీం కుందాభవంతి ప్రియే!
ప్రాయ స్త్వన్ముఖసేవయా విజయతే విశ్వంస పుష్పాయుధః

రాధికాదేవి యధర నేత్ర ముఖ కపోల నాసికావయవములు మన్మధునకు పంచబాణము లగుట యైదు సంఖ్యచే తెలియఁజేయబడెను.

శ్లో॥ దృశౌ "మదాలసే", వదన మిందు మత్యుజ్వలం
గతి ర్జన "మనోరమా" విధుతరంభ మూరుద్వయం
రతి స్తవ "కలావతీ" రుచిర 'చిత్రలేఖే' భ్రువా
వహో విబుధయౌవతం వహసి! తన్వి! పృథ్వీంగతా॥

రాధాదేవి కన్నులు ముఖము గమనము రతి కన్బొమలు వర్ణించు పదములలో "ఇందుమతి" "మనోరమ" "రంభ" "కలావతి" "చిత్రలేఖ" అను నప్సరసస్త్రీ నామములు స్ఫురించుచున్నవి.

శ్లో॥ సప్రీతిం తనుతాం హరిః కువలయాపీడేన సార్ధం రణే
రాధాపీనపయోధరస్మరణకృత్కుంభేద సంబేధవాః

యత్ర స్విద్యతి మీలతి క్షణమపి క్షిప్రం తథాలోకనాత్
కంసస్యాల మభూ జ్జితం జితమితి వ్యామోహకోలాహలః

కృష్ణుని బడఁగొట్టుటకు దుష్టుఁడగు కంసుఁడు ప్రయోగించిన కువలయాపీడమను మదపుటేనుఁగును చూచి బింకమగు దాని కుంభస్థలమును రాధికాదేవి చాచులుగా తలంపునకు వచ్చుట నొక తృటికాలము శ్రీకృష్ణుఁడు పారవశ్యము జెందుట ప్రకటితమైనది.

శ్లో॥ సుచిర మనునయేన ప్రీణయిత్వా మృగాక్షీం
గతవతి కృతవేశే కేశవే కుంజశయ్యాం
రచితరుచిరభూషాం దృష్టిమోషే ప్రదోషే
స్ఫురతి నిరవసాదాం కాపి రాధాం జగాద॥

చాలతడవు విరహముచే మృదుమధుర గభీర రసవత్తరమగు పలుకుబడిచే అనునయించి యమునా పరిసరమువ పొదరింటికి జేర, తన్నలంకరించుకొన్న రాధాదేవితో చెలికత్తె ప్రబోధించుట తెలియఁబడినది.

# సానందదామోదరము

అవినాభావయగు తన శక్తితో నానంద స్వరూపుఁడగు శ్రీకృష్ణుఁడు నిత్యానంద మనుభవించుట తెలియఁజేయఁబడినది.

## శ్రీహరి తాలరాజి జలధర విలసితము

(శ్రీ)కృష్ణపరమాత్మ నిల్కడగల నీలతోయద మధ్యస్థమగు విద్యుత్ప్రకాశము తెలియఁజేయబడినది.

మోహనరాగాది తాలాభ్యాంగీయతే

ప॥ ముగ్ధే! మధుమథనం

అ॥ అనుగత మనుసర! రాధే!

విరచిత చాటువచన రచనం చరణే రచితప్రణిపాతం
సంప్రతి మంజుల వంజులసీమని కేళిశయన మనుయాతమ్॥

ఘన జఘన స్తన భారభరేదర మంధర చరణవిహారం
ముఖరిత మణిమంజీర ముపేహి విధేహి మరాళనికారమ్॥

శృణు రమణీయతరం తరుణీజన మోహన మధురిపుభావం
కుసుమశరాసన శాసనవందినిపికనికరే భజ! భావమ్॥

అనిలతర కిసలయ నికరేణ కరేణ లతానికురంబం
ప్రేరణ మివ కరభోరు! కరోతి గతిం ప్రతిముంచవిలంబమ్॥

స్ఫురిత మనంగ తరంగవశా దివ సూచితహరి పరిరంభం
పృచ్ఛ! మనోహర హార విమలజలధార మముంకుచకుంభమ్॥

అధిగత మఖిలసఖీభి రిదం తవ వపు రపి రతిరణసజ్జం
చండి! రణితరశ నారవడిండిమ మభిసర! సరసమ లజ్జమ్॥

స్మరశర సుభగనఖేన సఖీ మవలంబ్య కరేణ సలీలం
చల ! వలయక్వణితై రవబోధయ హరి మపి నిగదితశీలమ్॥
శ్రీ జయదేవ భణిత మధరీకృతహార ముదాసిత వామం
హరి వినిహిత మనసా మధితిష్ఠతు కంఠతటీ మవిరామమ్॥

అందగత్తెవగునో రాధాదేవి నీకొఱకు యమునా పరిసరమందు పొదరింటికి జేరిననాయకుని శ్రీకృష్ణ భగవాను ననుసరింపుము. ఇంతదనుక నిన్ననునయ వాక్యముల నానంద పఱచి మిక్కిలిచక్కనైన యొక చోపూలపాన్పు కల్పించుకొని నీరాకను వినయముతో నిరీక్షించుచున్నాడు. యౌవన మధ్యస్థవగుట కొంచెము మెల్లగా చిఱుగజ్జెల యందియలు ఘల్లనిమ్రోయ రాజహంసలు సిగ్గుజెందు ఠీవి నడకతో వచటికిజేరుము. నీ నాథుఁడు పిల్లనగ్రోవి పాట వినుచు మన్మథుని శాసనమిదియని ప్రకటించు కోకిల ధ్వనిగా గుర్తెఱుంగుము మలయమారుతము సోకుచేకదలు చిగురులను చేతులతో నీ రమణునికడకు త్వరగా జనుమని పూఁదీవియలు సన్న దెలియఁజేయు చున్నవి పక్షోజము శ్రీకృష్ణుని గాఢాలింగన సౌఖ్యానుభవము ప్రకటించుచున్నది నీవనుభవింపబోవు సుఖస్వరూపము మాకందఱకు తెలియుమ మొలనూలి గజ్జెలమ్రోత జయఘంటాధ్వనిగా సరసముగా నభిమానమును వదలి త్వరగాఁజనుము. పూలవంటి గోరులు కల చెలికత్తియ కైదండగొని విలాసముగా కంకణముల

ప్రోత నీ నాథునకు నీ యవస్థ నెఱింగించిన శీఘ్రముగాఁ జనుము.

ఆత్మకు ఆత్మశక్తికి, ఐక్యము సమన్వయించుట రహస్యము.

శ్లో॥ అక్ష్ణో ర్నిక్షిప దంజనం శ్రవణయో
స్తాపింఛ గుచ్ఛావళీం
మూర్ధ్ని శ్యామసరోజదామ కుచయోః
కస్తూరికా పత్త్రికం
ధూర్తానా మభిసార సంభ్రమ జుషాం
విష్వఙ్నికుంజే సఖి
ధ్వాంతం నీలని చోళచారుసుదృశాం
ప్రత్యంగ మాలింగతి॥

ఇందు చీకటిని కాటుకగాను, కానుంగు పూగుత్తిగాను, నల్లకల్వగా, నీలాంబరముగా వర్ణింపఁబడినది.

శ్లో॥ కాశ్మీరగౌరవపుషా మభిసారికాణా
మాబద్ధరేఖ మభితో రుచిమంజరీభిః
ఏతత్తమాలదల నీలతమం తమిస్రం
తత్ప్రేమ హేమనికషోపలతాం తనోతి॥

చీకటిని వలపను బంగారు వన్నియను ప్రకటించుటకు నొఱగల్లని పోల్చినాడు.

శ్లో॥ హారావళీ తరళ కాంచన కాంచిదామ
మంజీర కంకణ మణిద్యుతి దీపితస్య
ద్వారే నికుంజనిలయస్య హరిం నిరీక్ష్య
వ్రీడావతీ మథ సఖీ మియ మిత్యువాచ॥

నాథుని సమీపముజేరియు సిగ్గిలుచున్న రాధను గూర్చి సఖిప్రబోధము తెలియఁజేయబడినది.

## సానంద దామోదర ప్రేమపదము

౧\ ఇది చిత్రప్రయోజనమువలన గలుగు నానంద స్వరూపమున నంకురించి కృష్ణరూపమగు ప్రేమవృక్షమును చిగురుటాకువలె నంతట వ్యాపించుటను తెలియఁజేయుచున్నది.

ఘంటారాగ - ఝంపాతాళాభ్యాంగీయతే

ప॥ ప్రవిశ రాధే! మాధవసమీప మిహ

అ॥ కురు మురారే! మంగళశతాని॥

మంజుతరకుంజతల కేలిసదనే
ఇహ విలస రతిరభసహసితవదనే॥

నవభవదశోకదళశయనసారే
ఇహవిలస కుచకలశతరళహారే॥

కుసుమచయరచితశుచివాసగేహే
ఇహవిలస కుసుమసుకుమారదేహే ॥

చలమలయవనపవనసురభిశీతే
ఇహవిలస మదనశరనికరభీతే॥

వితతనవవల్లినవ పల్లవఘనే
ఇహవిలస పీనకుచకుంభజఘనే॥

మధుముదితమధుపకులకలితరావే
ఇహవిలస! కుసుమశరసరసభావే॥

మధురతరళపికనికరనినదముఖరే
ఇహవిలస దశనరుచిరుచిరశిఖరే॥

విహితపద్మావతీసుఖసమాజే
భణతి జయదేవకవిరాజరాజే॥

నీ ముఖకాంతిచే చీకట్లుపాఱిపోవును శ్రీకృష్ణ నాయకుని దివ్యమంగళమూర్తిని కనులపండువొనరింపుము. పొదరిల్లే శయనాగారము. అశోకవృక్షము లిందెల్లవేళ పుష్పించును. నీ మెడలోని ముత్యాలహారముల సవదరింపుము. ఇది యానందమునకు స్థానమైనది. మన్మథబాణభయమును పోఁగొట్టజాలు చల్లనిపయ్యెర హాయిగా వీచుచున్నది. అన్నిరకముల తీవెలు చిగిర్చి హృదయానందము కలిగించును. తుమ్మెదలు మకరందమును గ్రోలి ఝుంకారము

తొనర్చుచున్నవి. నీ కోరిక ఫలించును. మఱపు జెందకుము. కోయులలు పంచమస్వరమున చెవిపండు వొనరించుచున్నవి. నీవు మిక్కిలి చక్కనిదానవు శ్రీకృష్ణుఁడును చక్కనివారిలో మిగుల చక్కనివాఁడు. కావున సిగ్గిలక కృష్ణుఁడున్న పొదరింటఁ బ్రవేశింపుము. (సమరసైక్యానుభూతిరహస్యము)

శ్లో॥ త్వాం చిత్తేన చిరం వహ న్నయ మతి
 శ్రాంతో భృశం తాపితః
కందర్పేణ చ పాతు మిచ్ఛతి సుధా
 సంబాధ బింబాధరం
అస్యాంకం త దలంకురు క్షణ మిహ
 భ్రూక్షేపలక్ష్మీలవ
క్రీతే దాస ఇ వోపసేవితపదాం
 భోజే కుత స్సంభ్రమః

ఎడబాటునందున దశావస్థల సమత్వమందిన రాధామాధవులు తిరిగి సమావేశమం దైక్య సుఖానుభూతియు సమముగాఁదనుట ధ్వనింపఁజేయబడినది.

శ్లో॥ సా ససాధ్వస సానందం
 గోవిందే లోలలోచనా
శింజాన మంజుమంజీరం
 ప్రవివేశ నివేశనమ్॥

లజ్జతో భయముగా సానందముగా రాధాదేవి నాథుం డున్న పొదరింటికి జేరుట తెలియంజేయంబడినది.

## సానంద గోవింద రాగ శ్రేణీ కుసుమాభరణము

ఇందు ఆనందముతో నుపనిష ద్వీథులం దిరుగు శ్రీకృష్ణపరమాత్మయందు అవినాభావ రాధాదేవీ ప్రకృతి యందు బయలుదేరు పాత్ర విచిత్రరూపమయిన కల్పనా పరంపరలను పుష్పములే ఆభరణములుగాం బేర్కొనంబడినది.

మాళవరాగాది తాళాభ్యాంగీయతే

ప॥ హరి మేకరసం చిర మభిలషితవిలాసం

అ॥ సా దదర్శ గురుహర్ష వశంవదవదన మనంగనివేశమ్॥

రాధావదనవిలోకనవికసిత వివిధవికారవిభంగం
జలనిధి మివ విధుమండలదర్శన తరళితతుంగతరంగమ్॥

హార మమలతరతార మురసి దధతం పరిరభ్య విదూరం
స్ఫుటతర ఫేనకదంబకరంబిత మివ యమునాజలపూరమ్॥

శ్యామలమృదులక ళేబరమండల మధిగతగౌరదుకూలమ్
నీలనళిన మివ పీతపరాగ పటలభరవలయితమూలమ్॥

తరలదృగంచలచలనమనోహరవదనజనితరతిరాగం
స్ఫుటకమలోదర ఖేలితఖంజన యుగ మివ శరదితడాగమ్॥

వదనకమలపరిశీలనమిళితమిహిరసమకుండలశోభం
స్మితరుచిరుచిరసముల్లసితాధరపల్లవకృతరతిలోభమ్॥
శశికిరణచ్ఛురితోదరజలధర సుందరసకుసుమకేశం
తిమిరోదితవిధుమండలనిర్మల మలయజతిలకనివేశమ్॥
విపులపులకభరదంతురితం రతికేళికలాభి రధీరం
మణిగణకిరణసమూహసముజ్జ్వలభూషణసుభగశరీరమ్॥
శ్రీజయదేవఫణితవిభవద్విగుణీకృతభూషణభారం
ప్రణమత! హృదివినిధాయ హరిం రుచిరం సుకృతోదయసారమ్॥

చాలకాలమునుండి సృష్టి విలాసము కోరుచున్న నాయికయొక్క స్వరూపుడయిన శ్రీకృష్ణనాయకుని తన ముఖమును చూచుటచే వివిధ వికారములు తరంగములు బుద్బుదములమీద నురుగువలె నడంగిసముద్రమువలె నిర్వికారుఁడగువాని యమునానదీ జలపూరమువలె ముత్యాల హారములు ధరించి మెఱయువాని పచ్చని పుష్పొడి పై భాగమందు దనసు నల్లని కల్వపూవువలె పచ్చని పట్టుపుట్ట ముతోఁ బొల్చు నల్లని శరీరము మెఱయువాని శరత్కాలమున కాటుకపిట్టల జంటగల పద్మములతో వెలయు కొలనువలెను కాటుకకంటి చూడ్కులుగల మొగముచే సత్యం తాసక్తిఁ గలిగించువాని ముఖపద్మమును పరిశీలింపవచ్చిన సహృదయమువ మాదిరి చెవులలోన రత్నకుండలములు

మెఱయువాని చిఱునగవుతోఁ బొలుచు కెమ్మోవి గలవాని లోపలఁ జిఱువెన్నెల వెలయు మేఘమండలమువలె పుష్ప గర్భితమయిన క్రొమ్ముడిగలవాని చిమ్మచీకట్లమధ్య చంద్ర మండలమువలె నెన్నొసట స్వచ్ఛమగు మంచిగంధపు తిల కము కలవాని (ఔత్తరీయ దేశీయ మర్యాద) చతుష్షష్టి కలాన్యాసము కలయికచేఁ బ్రకాశించువాని విరహాకృశాంగు డయ్యు సానంబెక్కిన రత్నమువలె మెఱయువాని రతనాల సొమ్ములు తమ కాంతుల తనకు నివాళి పళ్లెరమున నివా ళింప మెఱయఁజేయువానిని కృష్ణపరమాత్మను రాధాదేవి చూచెను.

శ్లో॥ అతిక్రమ్యాపాంగం శ్రవణపథ
పర్యంతగమన
ప్రయాసేనేవాక్ష్ణో స్తరళతర
భావం గమితయోః
ఇదానీం రాధాయాః ప్రియతమ
సమాలోకసమయే
పపాత స్వేదాంబుప్రసర ఇవ
హర్షాశ్రునికరః॥

రాధకు శ్రీకృష్ణసందర్శనము సమావేశము చిరకాల మునకు సులభమయినటంజేసి చాలదూరము నడచివచ్చినవారికి

మేనఁ జెమ్మటవలె కనులనుండి హర్షాశ్రువులు ధారలగుట తెలియ జేయఁ బడెను.

శ్లో॥ భజన్త్యా స్తల్పాంతం కృతకపటకం
డూతిపిహిత
స్మితం యాతే గేహాద్బహి రపి
హితాళీపరిజనే
ప్రియాస్యం పశ్యన్త్యా స్స్మరపరవశా
కూతసుభగం
సలజ్జాలజ్జాపి వ్యగమ దివ దూరం
మృగదృశః

ఇందు శరీరమును గోకికొను నెపమున కామావేశ మును తెలియఁజేయు చిఱునగవును మఱుగుపఱచుట యెఱిగి ప్రణయిని తలవంచుచున్న సిగ్గే తాను తలవంచుకొని దూరముగాఁజనుట ప్రకటింపఁ బడినది.

శ్లో॥ సానందం నందసూనుర్దిశతు పరతరంసమ్మదం మంద
మందమ్ రాధా మాధాయ బాహ్వో ర్వివరమనుదృఢం
పీడయన్ ప్రీతి యోగాత్
తుంగౌతస్యా ఉరోజావతనువరతనోర్నిర్గతౌ
మాస్మభూతాం
పృష్ఠం నిర్భిద్య తస్మాద్బహి రితి వలితగ్రీవ
మాలోకయంతః॥

రాధాదేవిగాఢ పరిరంభ సుఖానుభూతి మైమఱచిన శ్రీకృష్ణ నాయకుని యానందపారవశ్య ముద్బోధింపఁబడినది.

శ్లో॥ జయశ్రీ విన్యస్తై ర్మహిత ఇవ
మందారకుసుమై
స్స్వయం। సిందూరేణ। ద్విపరణముదా
ముద్రిత ఇవ
భుజా పీడక్రీడా హతకువలయా
పీడకరిణః
ప్రకీర్ణాసృగ్బిందు ర్జయతి భుజదండో
మురజితః॥

భయంకర రణరంగములందు జగత్కంటక దుష్ట రాక్షసులఁ జీల్చి చెండాడి జయలక్ష్మిచే స్వయంగ్రహాశ్లేషము (తనకు తానే కౌగలించుట) నందిన శ్రీకృష్ణ భగవానుని భుజదండ ప్రభావము పేర్కొనఁబడినది.

శ్లో॥ సౌందర్యైకనిధే రనంగలలనా
లావణ్యలీలా జుషో
రాధాయా హృదిపల్వలేమనసిజ
క్రీడైక రంగస్థలే
రమ్యోరోజ సరోజఖేలన రసి
త్వా దాత్మనః ఖ్యాపయన్
ధ్యాతు ర్మానసరాజహంసనిభతాం
దేయాన్ ముకుందో ముదమ్॥

శ్రీకృష్ణ భగవానుఁడు రాధాదేవి వక్షోజజన్య శృంగారరసవాహిని క్రీడించుటకంటె నిజపాదపద్మ భజన సర్వాధాచార్య యోగీశ్వరుల మానసములను సరస్సుల రాజహంసయగుట యిష్టమని తెలియఁ జేయఁబడినది.

శ్లో॥ గతవతి సఖీబృందే౽మందత్రపాభర నిర్భర
స్మరపరవశాకూతస్ఫీతస్మితస్నపితా ధరామ్
సరసమనసం దృష్ట్వా హృష్టాం ముహు ర్నవపల్లవ
ప్రసవశయనే నిక్షిప్తాక్షీ మువాచ హరిః ప్రియమ్॥

ఆత్మసుఖానుభూతికై యనుక్షణము నిరీక్షించుచు శరీరమువంటి మెత్తని పూబాన్పుననున్న తన్ను నిరీక్షించుచు క్రొత్తయట్లు లజ్జించుచు సీత్కారములచే నెమ్మోవిని తడుపుకొనుచున్న రాధాదేవినిజూచి శ్రీకృష్ణ నాయక శిరోమణి ప్రియములు పలుకుట తెలియఁ జేయఁ బడినది.

# మధురిపు విద్యాధర లీలము

ఇందు శ్రీకృష్ణుఁడు సర్వవిధములయందు నారి తేరిన వాఁడగుట ఏసమయమం దెవరితో నెట్లు మాట్లాడవలయునో తెలిసినవాఁడగుట తెలియఁ జేయఁబడినది.

విభావ (నాదనామక్రియ) రాగము-ఆదితాళము

ప॥ క్షణ మధునా నారాయణమ్ అ॥ అనుగత మనుసర రాధే

1. కిసలయశయనతలే కురు కామిని! చరణనళినవినివేశమ్
తవపదపల్లవవైరి పరాభవ మిద మనుభవతు సువేశమ్॥

2. కరకమలేన కరోమి చరణ మహ మాగమితాసి విదూరమ్
క్షణముపకురు శయనోపరిమామివనూపురమతిగతిశూరమ్

3. వదనసుధానిధిగళిత మమృతమివరచయవచనమనుకూలం
విరహమివాపనయామిపయోధరరోధకమురసిదుకూలమ్॥

4. ప్రియపరిరంభణ రభసవలిత మివ పులకిత మతిదురవాపం
మదురసి కుచకలశం వినివేశయ శోషయ మనసిజతాపమ్॥

5. అధరసుధారస ముపనయ భామిని! జీవయమృతమివదాసం
త్వయి వినిహితమనసం విరహానల దగ్ధవపుష మవిలాసమ్॥

6. శశిముఖి! ముఖరయమణిరశనాగుణమనుగుణకంఠనినాదమ్
శ్రుతియుగళే పికరుత వికలే మమశమయచిరాదవసాదమ్

7. మామతివిఫలరుషా వికలీకృత మవలోకితు మధు నేదం
మీలతి లజ్జిత మివ నయనం తవ విరమ విసృజరతిఖేదమ్॥

8. శ్రీజయదేవభణిత మిదమనుపదనిగదితమధురిపుమోదం
జనయతు రసికజనేషు మనోరమ రతిరస భావవినోదమ్॥

ఈ యష్టపదియందు ప్రకృతి పురుషులే రాధాకృష్ణులనియు ( ఆత్మశక్తులొక్కటియేయని ) ఆత్మసాక్షిత్వమున ప్రకృతిగా వెలయుచున్నదనియు ధ్వనింపఁజేయుటచే నవరసములలో విశ్వమోహనమగు శృంగారరసము తమసామ్మోయనుటను ప్రార్థనారూపమున ప్రకటించెను. వింధ్యరాజు పట్టపుదేవి నాస్థూలశరీరము సురక్షితముగా నుండఁగనే నిన్ను పరీక్షించుటకు నేను సూక్ష్మశరీరము ధరించితినని ప్రకటించుట నీవు చాలదూరమునడచి బడలియుంటివి. ప్రపంచమునకు పాతివ్రత్యమహిమ నాచరించి బోధించితివి నాకు మహానందము కలిగినది. నే నేకపత్నీ వ్రతుఁడను కావున నిర్వ్యరము సమానంద మనుభవింపవలెను. కావున మున్మున్ను నన్ననుసరించి ప్రక్కఁజేర్చుము. మృదుమధుర వచనామృతమును గ్రోల్చుము. నిరోధము తెల్పించి యైక్య సుఖమనుభవింతము చెవులపండువగు ప్రణవనాదమును పూరింపుము. నేత్రాంతముల నానంద పారవశ్యమున చొక్కుము. అనుచు (నద్వైతరహస్యమును బోధించెను.)

శ్లో॥ ప్రత్యూహః పులకాంకురేణ నిబిడాశ్లేషే నిమేషేణచ
క్రీడాకూత విలోకితేఽధరసుధాపానే కథానర్మభిః
ఆనందాధిగమేన మన్మథకలా యుద్ధేఽపియస్మిన్నభూత్
ఉద్భూత స్సతయోర్బభూవసురతారంభః ప్రియంభావుకః॥

నాయికా నాయికులకు నన్యోన్యమైక్యము జెందు నపుడు దాని కంగములయిన భోగ చిహ్నములు కూడ విఘ్న కారులుగా భావించుట తెలియఁ జేయఁ బడినది.

శ్లో॥ దోర్భ్యాం సంయమితః పయోధరభరే
ణాపీడితః పాణిజై
రావిద్ధో దశనైః క్షతాధరపుట
శ్శ్రోణీతటే నాహతః
హస్తే నానమితః కచేఽధరసుధా
స్యందేన సమ్మోహితః
కాంతః కామపితృప్తిమాపతదహో!
కామస్య వామాగతిః।

ప్రాకృత నాయికా నాయికులకు విషయానందానుభూతియే తృప్తిస్థానమనియు అప్రాకృత రాధామాధవులకు నిర్విష యానందానుభూతి యవాఙ్మానస గోచర మనియును తెలియఁ జేయఁ బడినది.

శ్లో॥ వామాంకే రతికేళిసంకులరణారంభే తయా సాహస
ప్రాయం కాంతజయాయకించిదుపరిప్రారంభి
యత్సంభ్రమాత్
న్నిష్పందా జఘనస్థలే శిథిలితా దోర్వల్లిరుత్కంపితం
వక్షో మీలిత మక్షి పౌరుషరసః స్త్రీణాంకుత స్సిధ్యతి॥

దీనియందు ప్రకృతి అస్వాతంత్ర్య యగుట తెలియఁ జేయఁ బడెను.

శ్లో॥ తస్యాః పాటలపాణిజాంకిత మురో
నిద్రాకషాయే దృశౌ
నిర్ధౌతోఽధరశోణిమా విలులితా
స్రస్తస్రజో మూర్ధజాః
కాంచీదామ దరశ్లథాంచితమితి
ప్రాత ర్నిఖాతై ర్దృశో
రేభిః కామశరై స్తదద్భుత మభూ
త్పత్యు ర్మనః కీలితమ్॥

సుఖానుభూతి సమనంతరమున నాయకునకు, నాయిక నేత్రాదుల యందును శృంగార చిహ్నముల మార్పులు మన్మథ బాణము లగుట ధ్వనింప జేయబడినది.

శ్లో॥ వ్యాకోశః కేశపాశ స్తరళితమలకైః స్వేదమోక్షౌ కపోలౌ
క్లిష్టాబింబాధరశ్రీః కుచకలశరుచా హారితా హారయష్టిః
కాంచీకాంతి ర్హతాశా స్తనజఘనపదం పాణినాచ్ఛాద్య సద్యః
పశ్యంతీ సత్రపా మాంతదపి విలులితా ముగ్ధకాంతి ర్ధినోతి॥

స్త్రీకి పురుషభోగ సమయమునం దక్క సర్వదా లజ్జయే యాభరణ మగుట యెఱుక పఱుపఁ బడినది.

శ్లో॥ ఈషన్మీలిత దృష్టి ముగ్ధవిలసత్సీత్కారధారావశా
దవ్యక్తాకుల కేళి కాకు వికసద్దంతాంశుధౌతాధరం
శ్రాంతస్తబ్ధపయోధరం భృశపరిష్వంగాత్కురంగీదృశో
హర్షోత్కర్షవిముక్తినిస్సహతనో ర్ధన్యో ధయత్యాననమ్॥

రాధామాధవుల యన్యోన్యైక్యము సవికల్ప సమాధిగా ధ్వనించుచున్నది.

శ్లో॥ అథ సహసా సుప్రీతం
సురతాంతే సా నితాంతఖిన్నాంగీ
రాధా జగాద సాదర
మిద మానందేన గోవిందమ్॥

ఒకటే యయ్యును స్త్రీ పురుష చిహ్నములతో రెండుగాను తోచుచున్న ప్రకృతి పురుషులు రాధామాధవులు సందోపదేశము వలన (గురూపదేశమువలన) యమునా కూలమున మహోత్కర్ష జెందు రహః కేళవులు (ఇడాపింగళా మధ్యనున్నసుషుమ్నా నాడి యందు సమైక్య స్థితి) రాత్రివేళ (మఱపు జెందుట) వలన సమవిహారావస్థ కొంత కాలమునకడపి (అనగా స్వయం ప్రభులగు సత్పాత్రప్రబోధము కలుగు వఱకు) ప్రబోధము కలిగిన వెంటనే యద్వైతానందమనుభవించుట వాచామగోచరము రాధామాధవమున వచనీయము చేయఁబడినది.

# సుప్రీత పీతాంబర తాళ శ్రేణి

రాధ ఇరువది రెండవ యష్టపదిని మంత్ర పుష్పము లోని మంత్రార్థ స్వరూపమును సందర్శించు నప్పుడు ప్రయోగించిన రాగ శ్రేణి యను పదమునకు సరిగా తాళ శ్రేణి యని యీయష్టపది యందు ప్రయోగింపఁ బడినది. (రాగ మనఁగా) రజింపఁ జేయునది తాళ మనగా దానిని నిలఁబెట్టునది. (ఆత్మ సాక్షాత్కార మయిన దానిని నిత్య సాక్షాత్కారముగా నిలుపుట పరమాత్మ యయిన పీతాం బరునకు ప్రీతి యగుట యని ధ్వనింపఁ జేయఁ బడినది.

మంగళకౌశిక రాగః—చాపుతాళః

1. కురు యదునందన! చందనశిశిరతరేణకరేణ పయోధరే
మృగమదపత్రక మత్ర మనోభవమంగళ కలశసహోదరే॥

2. అళికులగంజన మంజనకం రతినాయక సాయకమోచనే
త్వదధరచుంబనలంబిత కజ్జల ఉజ్జ్వలయ ప్రియలోచనే॥

3. నయనకురంగతరంగ వికాసనిరాసకరే శ్రుతిమండలే
మనసిజపాశవిలాసధరే శుభవేశ నివేశయ కుండలే॥

4. భ్రమరచయంరచయంతముపరిరుచిరంసుచిరంమమసమ్ముఖే
జితకమలే విమలే పరికర్మయ నర్మజనక మలకం ముఖే॥

5. మృగమదరసవలితం లలితం కురుతిలక మళికరజనీకరే
విహితకళంకకళం కమలానన! విశ్రమితశ్రీకరే॥

6. మమ రుచిరే చికురే కురు మానద ! మనసిజధ్వజచామరే
రతిగలితే లలితే కుసుమాని శిఖండి శిఖండక డామరే॥

7. సరసఘనే జఘనే మమ శంబరదారణవారణకందరే
మణిరశనా వసనాభరణాని శుభాశయ ! వాసయసుందరేః

8. శ్రీ జయదేవవచసిరుచిరే హృదయంసదయంకురుమండనే
హరిచరణస్మరణామృత నిర్మితకలికలుషజ్వరఖండనేః

శ్రీకృష్ణుఁడు మంచిగంధమువలె చల్లనైన చేతితో రాధ పాలిండ్లయందు మకరికాది పత్రరచనచేయుచున్నట్లు మన్మథబాణమగు కంటియందు కాటుక తీర్చుచున్నట్లు పరుగులెత్తు కన్నులను లేళ్ళను నిలుపు పగ్గములగు వీనులయందు రత్నకుండలములు ఘటించుచున్నట్లు ముఖపద్మమున వాలిలు తుమ్మెదలు ముంగురులు దువ్వుచున్నట్లు నెన్నొసట నెలయందు మృగలాంఛనమట్లు గుమగుమలు గుబాళించు కస్తూరీతిలకము సవదరించుచున్నట్లు విచ్చిన నెమలిపురివలె మన్మథుని జెండావలెనున్న పీడినక్రొమ్ముడిజడను చిక్కుదీసి పువ్వులు తఱుముచున్నట్లు మదనుఁడను మదగజము నివసించు కటిస్థలమునందు చిఱుగజ్జెల బంగరుటొడ్డాణము వస్త్రాలంకారము నెలకొల్పుచున్నట్లు ఆత్మకు ఆత్మశక్తికి నభేదము జెప్పునద్వైత మతత్త్వమును కవితాసామగ్రీ సమగ్రకలా ప్రపూర్ణుఁడగు జయదేవరస సిద్ధకవి చిత్రమగు వాఙ్మయ శిల్పమునందు చిత్రించినాడు.

శ్లో॥ రచయ కుచయోః పత్రంచిత్రం కురుష్వ కపోలయోః
ఘటయ జఘనే కాంచీ మంచస్రజం కబరీభరే
కలయ వలయశ్రేణీం పాణౌ పదే కురు నూపురా
ఇతి నిగదితః ప్రీతః పీతాంబరోఽపి తథాఽకరోత్॥

శిథిలమగు రాధాలంకార సామగ్రిని యథాస్థానముం జేర్చి శ్రీమద్రామాయణ మట్లు గాయత్రీ మంత్రాక్షర చతుర్వింశతి సంఖ్యచే భక్తకోటి, నిత్యసంకీర్తనమున తరింప శుద్ధాద్వైత ఫలశ్రుతితో గీతగోవింద మహాకావ్యము, గేయగానగతి గమకాదిజయశంఖ ధ్వనులను పూరించినాడు. రాధాకృష్ణుల (ప్రకృతి పురుషుల) (ఎండకు వానకు తడియక రంగులుచెడక చెక్కుచెదరక ప్రకాశించు వాఙ్మయ శిల్పమున భావప్రపంచ వీధుల బాహాటముగాఁ దిరుగఁజాలిన వారికి కన్పండువుగా) నిరువదినాల్గు రాధాకృష్ణుల ప్రతిబింబములు నిర్మించి జయదేవ మహాకవి జగన్నాథాపరావతారము సర్వదేశముల సుకీర్తి మొదలగు దండిప్రోక్త మహాకావ్య ప్రయోజనములను ప్రత్యక్ష మొనర్చెను.

శ్లో॥ యద్గాంధర్వకలాసుకౌశల మనుధ్యానంచయద్వైష్ణవం
యచ్ఛృంగారవివేక తత్త్వరచనా కావ్యేషు లీలాయితం
తత్సర్వం జయదేవ పండితకవేః కృష్ణైకతానాత్మనః
సానందాః పరిశోధయంతు సుధియః శ్రీగీతగోవిందతః॥

అను శ్లోకమున జయదేవ మహాకవికిగల రాగ తాళ లయాభినయ గతి గమకాది సంగీతశాస్త్ర ప్రవేశము రస భావ కల్పనా మాధుర్యౌచితీ సమంచిత విద్వత్కవి వైదుషి కవితా రచనలయందును భక్తితత్త్వములందును బుద్ధిమంతు లీ గీతగోవింద కావ్యపఠనమునఁ దెలిసి సదానందము జెందఁ దగుట ప్రకటింపఁబడినది.

శ్లో॥ శ్రీభోజదేవ ప్రభవస్య రామా
దేవీసుత శ్రీజయదేవకస్య
పరాశరాది ప్రియవర్గకంఠే
శ్రీగీతగోవిందకవిత్వ మస్తు

జయదేవుని తండ్రి (భోజదేవుఁడని) తల్లి (రామాదేవియని) పరాశరుఁడు మొదలగు సుహృత్కవులు గీత గోవింద కావ్యమును కంఠస్థముఁ జేయుట తెలియఁజేయ బడినది.

శ్లో॥ సాధ్వీమాధ్వీక! చింతావభపతిభవతశ్శర్కరే!కర్కశాసి
ద్రాక్షే! ద్రక్ష్యంతి కేత్వామమృత! మృతమసిక్షీ
ర! నీరం రసస్తే
మాకంద! క్రందకాంతాధర! ధరనతులాంగచ్ఛ
యచ్ఛన్తిభావం
యావచ్ఛృంగారసారంశుభమివజయదేవస్య
వైదగ్ధ్యవాచః॥

శ్రీ గీతగోవింద కావ్యమాధుర్యమునకు మాధుర్యము నందు ప్రసిద్ధిగాంచిన (ఇప్పపూవు) పూఁదేన కండెచక్కెర ద్రాక్ష తియ్యమామిడి రసాలు (అధరము) మొదలయిన వియు కాక సముద్రమథన సంప్రాప్తమై దేవతలకు జరాత్ము త్రిష్ణులనడంపఁజాలిన యమృతముకూడ చాలదని జయదేవ దేవకవి కవితా మాహాత్మ్యము ప్రస్ఫుటముగాఁ దెలియఁ జేయఁబడినది.

శ్లో॥ ఇత్థం కేళితతీ ర్విహృత్య యమునాకూలే సమం రాధయా
తద్రోమావళిమౌక్తికావలియుగే వేణీభ్రమం బిభ్రతి
తత్రాహ్లాదికుచప్రయోగ ఫలయోర్లిప్సావతో ర్హస్తయో
ర్వ్యాపారాః పురుషోత్తమస్యదదతుస్స్ఫీతాం
ముదాంసంపదమ్॥

జయదేవకవి ఇత్థం నందని దేశతః. అని ప్రారంభించిన రాధాకృష్ణుల యమునానదీతీరమందలి రహః కేళులు ఇత్థం కెళితతీ ద్విహృత్యయని సంభోగబాహ్య శృంగారరసతృప్తికి నాయికా నాయకులకు గాఢాలింగ నైక్యము ప్రకటించి పరబ్రహ్మ ఆత్మశక్తితో ఇడాపింగళాసుష మ్నానాడుల యందు సచ్చిద్రూపమున సంచరించుట ప్రయాగక్షేత్ర మందు గంగా యమునా సరస్వతీ (త్రివేణీ) సంగమరూపమున గీతగోవింద కావ్యపరమ ప్రయోజన రహస్యము ధ్వనింప జేసెను.

---

అజంతా ఆర్టు ప్రెస్, తెనాలి.

# శ్రీ చల్లా పిచ్చయ్యశాస్త్రిగారి రచనలు

1. శ్రీహేరంబస్తుతి
(గణపతిప్రస్తుతి)
2. కుచేలోపాఖ్యానము
(హరికథ)
3. మాయావిలాసము
(కాశీమజలీలలోనిది కీలుగుఱ్ఱముకథ) 0–4–0
4. రామదాసు చరిత్రము
(5 ఆశ్వాసముల స్వతంత్ర ప్రబంధము గోపన
భక్తజీవితము)
5. భాషాభ్యుదయము
(విద్యార్థులకు లోకజ్ఞానము కలిగించు
వ్యాసములు 0–12–0
6. గురుచరిత్ర
(గురుమహిమను తెలియఁజేయు ఖండకావ్యము)
7. సావిత్రిచరిత్ర
(హరికథ)
8. హేరంబ శతకము
(గణపతి నవరాత్రముల ప్రభావము తెలియజేయునది)
9. బాలకోటీశ్వరశతకము
(గోవాడవద్దనున్న బాలకోటీశ్వర మహిమ
తెలియజేయునది)

## II

10. హంసలదీవి ప్రభావము
(కృష్ణా సాగర సంగమప్రభావము తెలియజేయునది)

11. త్యాగరాయ చరిత్ర
(పద్యములయందు కృతుల పల్లవుల దెలియజేయు ఖండకావ్యము)

12. సీతానగర హనుమచ్ఛతకము
(ఏకప్రాసముకలది)

13. దుర్గామల్లేశ్వరశతకము (ఏకప్రాసముటీకాసహితము)
(విజయవాడ సత్యనారాయణ పురములోని క్రొత్తగుళ్ల మహిమను తెలియజేయునది)

14. బ్రహ్మానందచరిత్ర (హరికథ)
(సుప్రసిద్ధ సిద్ధపురుషమహిమ బోధకము)

15. భాగవతసారము
(సంస్కృత వాఙ్మయము)

16. ప్రౌఢకవి ప్రయోగదర్పణము
(పూర్వకవుల యపూర్వప్రయోగముల తెలియజేయునది)

17. ఔచిత్యవిచారచర్చ
(క్షేమేంద్రకృతి కనువాదము)

18. కృష్ణప్రబోధము
(భగవద్గీతా సారాంశము సీసమాలికలు)

19. వ్యాసదర్పణము
(ప్రకృతమునందుపయోగించు శీర్షికలుకలది)

20, ప్రపంచము
(ఆధునిక సనాతనపాత్ర ప్రశ్నోత్తరరూపకలోక
సర్వసందేహావిచ్ఛేదకము)

21. సచ్చిదానందేంద్ర సరస్వతీ స్వాములవారి చరిత్ర
(హరికథ అనంతవరము స్వామివారి బ్రహ్మ)
విద్యాప్రబోధము)

22. ఉపదేశము
(బాలకప్రబోధము)

23. సంక్షిప్తచరిత్రలు
(ఆశుకవితలోఁ చెప్పబడనవి)

24. శుక రంభా సంవాదము
(శుకుని వైరాగ్యవాక్యములను శృంగారపరముగా
విఱిచి చెప్పుట)

25. ఆంధ్ర గీతగోవిందకావ్యము
(స్వతంత్రానువాదము) 2-0-0

26. శివాపరాధదేవ్యపరాధస్తోత్రము
(శంకరాచార్య కృతి కనువాదము)

27. ఉద్యానము (నిర్వచనము)
(నన్నయ మొదలు రాయలవఱకుగల పూర్వకవుల
వాఙ్మయ విశేషములు 0-8-0

28. చాటుపద్యమణిమంజరి
(కవితాలతాపుష్పమంజరి)

29. చంద్రకాంతీయము (నాటకము)
(చిత్రమగుచరిత్ర)

30. జయప్రద (నాటకము)
(పాతివ్రత్య ప్రత్యక్షప్రమాణము)

31. చాణక్యనీతిదర్పణము
(స్వతంత్రానువాదము లోకజ్ఞాననిధి)

32. కన్నప్పచరిత్ర (హరికథ)
(భక్తిరస ప్రబోధము)

33. వారణాశి రామసుబ్బయ్యగారి జీవితచరిత్ర
(అర్వాచీనాంధ్ర గాయనవాచస్పతి దిగ్విజయము)

34. గీతగోవింద రహస్యము
(అష్టపదులలో జయదేవుడుచూపిన వాఙ్మయ
శిల్పములోని శ్రీరాధాకృష్ణమూర్తుల పరిదర్శనములు)

35. శాకుంతల పాత్రప్రయోజనము
(నాటకములోని పాత్రకల్పనవలని ప్రయోజనము)

36. హనుమత్ చరిత్ర
(ఉత్పత్తి, పరిణయము, విజయము)

37. భాషావిభాగదర్పణము
(వ్యాకరణము, ఛందస్సు, అలంకారములు, మొదలగు
వాఙ్మయ ప్రదర్శనము)